*Ghair Islami Riyasat Aur Musalman (Telugu)*

# ఇస్లామేతర రాజ్యం - ముస్లిములు

రచన

**మౌలానా సయ్యిద్ జలాలుద్దీన్ ఉమరి**

అనువాదం

**ఎస్.ఎమ్. మలిక్**

# ఇందులోని విషయాలు

## మొదటి అధ్యాయం



## రెండవ అధ్యాయం

## మూడవ అధ్యాయం





# ముందుమాట

ఏ విషయాన్ని, ఏ సిద్ధాంతాన్ని గురించి అయినా గంభీర చర్చ, సంభాషణ తప్పయినది కాదు, నిజానికి అది అనేక కోణాలలో ప్రయోజనకరమే అవుతుంది. కాని అనవసరం ప్రశ్నోత్తరాలు, విమర్శలు, తీవ్రమయిన దాడులు సరయినవని చెప్పలేము. ఇలా చెయ్యడం అక్రమమయిన, అసమంజసమయిన వైఖరి. దీనివల్ల సమస్యను అర్థం చేసుకోవడంలో సహకారం దొరకదు, ఇంకా చిక్కులు పుడుతాయి. అనుకూల ప్రతికూల వాదనలు చేసే వారి మధ్య మానసికంగా దూరాలు ఎరుగుతాయి. మరి సమయం దాటినకొద్దీ అది పెరుగుతూనే ఉంటుంది. దాని ప్రభావం జీవితం మొత్తాన పడుతుంది.

విచారకరమయిన విషయమేమిటంటే, ఇస్లామ్ విషయంలో ఇదే వైఖరిని దాని విరోధులు అవలంబించారు. వారు చర్చలు, వాదనలు జరిపితే ఈ తప్పుడు విధానాన్నే అనుసరిస్తారు. ఇస్లామ్ బోధనలకు వారికి ఇష్టమయిన వివరణలు, విశదీకరణలు చేస్తారు. దానికి ఏ విధంగానూ అతకని ఆక్షేపణలు దాని మీద చేస్తారు. దాన్ని గురించి చూస్తూ, చూస్తూ కానరాని అపోహలు అపార్థాలు సృజిస్తారు. ఇస్లామ్‌ను దాని నిజ స్వరూపంలో చూసే ఏ ప్రయత్నమూ చెయ్యరు. ఇదేదో కొత్తగా, వింతగా ఏర్పడిన స్థితి కాదు. దీనికి సంబంధించిన ఓ సుదీర్ఘ చరిత్ర ఉంది. నేడు ఆ చరిత్రనే విభిన్న కారణాల రీత్యా మరింత బలంగా, ఉధృతంగా పునరావృతం చెయ్యడం జరుగుతోంది.

ఇస్లామ్‌ను ప్రస్తావించినప్పుడల్లా ఈ ధర్మం, ఆటవికమయిందన్నట్టుగా, క్రూరమయినటువంటిదిగా ప్రస్తావిస్తారు. దాని ఆలోచనలు, భావనలు, బుద్ధికందనివని, అసహజమయినవని, యదార్థ విరుద్ధమయినవని, నేటి కాలానికి స్వీకారయోగ్యం కానివని చెబుతారు. దాని నైతిక నియమాలు, దాని చట్టాలు న్యాయం ఆవశ్యకతల్ని పూర్తి చెయ్యవని, అది మానవుల్ని ఇస్లామ్‌ను నమ్మేవారుగా, నమ్మనివారుగా విభజిస్తుందని, ఉభయుల హక్కులు వేర్వేరుగా నిర్ణయిస్తుందని, దాని వ్యవస్థలో సమానత సమభావనలు లేవని ఆరోపిస్తారు.

ఈ కాలపు ఈ భయంకర వాతావరణంలో, విచ్ఛిన్న పరిస్థితుల్లో, ఇస్లామ్‌ను విశ్వసించి దానిమీదనే తమ నమ్మకం దృఢపరచుకున్న వ్యక్తులు సముదాయాలను, ఇంకా ఇస్లామ్ ప్రపంచానికి కారుణ్య కారణమని అత్యుత్తమ వ్యవస్థ అని భావించేవారిని ఆలోచనాత్మకంగా పెడదారిలో పడిపోయినవారని నిర్ణయించడం ఆశ్చర్యకరమయిన విషయం కాదు. వారు నిజానికి విశ్వాసం, నమ్మకాల రీత్యా

ఇస్లామ్ ఉన్నతిని కోరుకునేవారు. వారు దానికొరకు చట్టం, న్యాయవ్యవస్థకు లోబడి, ఆ పరిమితుల్లో కృషి జరుగుతున్నప్పటికీ వారిని తీవ్రవాదులని, బర్బరులని భావించడం జరుగుతోంది. ఇదేదో, ఏదయినా ప్రత్యేక సంఘటన కారణంగా లేదా దుర్ఘటన కారణం దాని మూలంగా, ప్రతిచర్యగా ఏర్పడే తాత్కాలిక భావన కాదు. ఇది వాస్తవంగా బాగా ఆలోచించి పథకం ప్రకారం జరుగుతున్న ప్రచారం.

ప్రస్తుతం సమస్య ఏదయినా ప్రత్యేక వర్గం వరకు పరిమితం కాదు, ఇంకా ముందుకుసాగి, మొత్తం ముస్లిమ్ సముదాయానికీ సంబంధించింది. దాని నలువైపులా అపోహలూ అపార్థాలూ ముసురుకున్నాయి, ఇంకా నిజానికి చుట్టుముట్టాయనే చెప్పాలి. ముస్లిమ్ సముదాయం చిత్రణ జరిగే విధానాన్ననుసరించి, దాని ద్వారా ఎటువంటి మేలును, మంచిని, ఉన్నత నైతికతను ఆశించడానికే వీలులేదు; దాని సమస్త చరిత్రనే సందేహాస్పదం చేసి పెట్టారు. సమాజం కొరకు దానిద్వారా ఎటువంటి ప్రయోజనం ఒనగూడే అవకాశం మునుపెన్నడయినా ఉంటే ఉండేదేమోకాని, నేడయితే ఎటువంటి ప్రయోజనం దానివల్ల ప్రాప్తం కాదన్నమాట ప్రబలిపోయేలా చేశారు.

ఇస్లామ్ ఈ భావనలన్నింటినీ ఆసాంతం ఖండిస్తుంది. వీటికి ఇస్లామ్‌తో ఎటువంటి సంబంధం, దూరపుదయినా దగ్గరిదయినా లేనేలేదు. ఇస్లామ్ ఏమిటి? ఇస్లామ్ అని దేన్నంటారు? ఒకే దేవుని ఆరాధన, ఆయన విధేయత, ఆయన పట్ల నిష్ఠ (తక్వా), నిత్యం ఆయన వైపునకు మరలి ఉండటం, శాంతిశ్రేయాలు, శుభం సుహృద్భావం, మానవుణ్ణి మానవునిగా భావించడం, మానవుని పట్ల శుభాన్ని కాంక్షించడం, అన్యాయాన్ని అక్రమాన్ని అంతమొందించడం, న్యాయాన్ని స్థాపించడం, మానవుల మధ్య బూటకపు, మిథ్యా తారతమ్యాలను తుడిచిపెట్టడం, మానవులతో సమానతా వ్యవహారం చెయ్యడం, వారి సహజమయిన హక్కుల్ని రక్షించడం- ఇదీ ఇస్లామ్ నిజరూపం.

ఇస్లామ్ నిజబోధనల్ని తెలుసుకుని, అర్థం చేసుకుని ఏ వ్యక్తి అయినా ఇస్లామ్ చిత్రాన్ని కళ్ళారా చూసుకోగలడు. లక్షలాది ప్రయత్నాలు జరిపి వీటిపైన తెరలు కట్టడం సులువు కాదు. ముమ్ముందు వస్తున్న పుటల్లో దీన్నే విశదపరచడానికి ఒక స్వల్పమయిన కృషి జరిగింది. దీనికి దైవం స్వీకృతి ప్రసాదించాలని, ఏ ఉద్దేశ్యంతో ఈ ప్రయత్నం, దీని రచన జరిగిందో అది నెరవేరాలని ప్రార్థిస్తున్నాను.

**- జలాలుద్దీన్ ఉమరి**

మార్చి, 2, 2003

# మూడవ ముద్రణ

"ఇస్లామేతర రాజ్యం - ముస్లిములు" రెండు ముద్రణలు లోగడ ప్రచురించబడ్డాయి. ఈ మూడవ ముద్రణలో పుస్తకాన్ని పునఃపరిశీలించడం జరిగింది. కొన్ని విషయాలు పెంచబడ్డాయి. 'ముస్లిములు, ముస్లిమేతర సంబంధాలు' అనే కొత్త వ్యాసం ఇందులో చేర్చబడింది. పుస్తకం కూర్పును సయితం బాగుపరిచే ప్రయత్నం జరిగింది. మానవ హక్కులు నేడు ఒక సజీవ విషయం. మహిళల హక్కులను గురించి రచయిత చాలా వివరంగా వ్రాసి ఉన్నాడు. ఇంతే ఈ విషయంపైన రచయిత వ్రాసిన దిగువ పుస్తకాలు ప్రచురించబడి ఉన్నాయి :

1. ముస్లిమేతరులతో సంబంధాలు, వారి హక్కులు
2. ఇస్లామ్ - మానవ హక్కుల రక్షణ
3. బలహీనులు, పీడితులు - ఇస్లామ్ నీడలో

ప్రస్తుత పుస్తకం కూడా చాలావరకు మానవ హక్కులకు సంబంధించిందే. అందువల్ల పైన పేర్కొన్న పుస్తకాల చర్చలు కూడా అక్కడక్కడ ఇందులో వచ్చేశాయి. ఇటువంటి చర్చ వచ్చిన చోటల్లా లోగడ వచ్చిన విషయాన్ని యథాతథంగా ప్రస్తుతపరచడానికి బదులు దాన్నే కొత్త శైలిలో, సరికొత్త విధానంలో ముందుంచడానికి ప్రయత్నించడం జరిగింది. పుస్తకంలోని చర్చలన్నీ సూత్రప్రాయమయినవి. వివరాలు, నిమ్న విషయాలను చర్చలోకి తీసుకురాకుండా జాగ్రత్త పడటం జరిగింది. ప్రస్తుత పరిస్థితుల్లో దీనివల్ల ప్రయోజనం కలుగుతుందని ఆశిస్తున్నాను.

పరమ ప్రభువు అల్లాహ్ ఈ ప్రయత్నాలను స్వీకరించి తప్పిదాలను మన్నించాలని వేడుకుంటున్నాను.

– జలాలుద్దీన్ ఉమరి

ఏప్రిల్ 4, 2010

## మొదటి అధ్యాయం

# ఇస్లామేతర రాజ్యం-ముస్లిములు

### ఈ చిత్రం సరయినది కాదు

ఇస్లామ్ అధ్యయనం భిన్న కోణాలలో సాధ్యమే. ప్రస్తుతం ఓ ప్రత్యేక కోణంలో దాని అధ్యయనం చేద్దాము. అదేమిటంటే ఇస్లామ్‌ను గురించి ఓ భావన కల్పించడానికి సాధారణంగా ప్రయత్నం జరుగుతుంది. అది ఇస్లామేతర రాజ్యం, ఇస్లామేతర సమాజానికి వ్యతిరేకంగా విద్వేషాన్నీ వైషమ్యాన్ని అతి తీవ్రంగా ప్రజ్వలింపజేస్తుంది అని. ఇంకా, అది ఇస్లామేతర వ్యవస్థను ఎట్టి పరిస్థితిలోనూ, ఆమోదించదు, తన అనుయాయుల్ని, దానికి ఎదురుతిరిగి తిరుగుబాటు చేయాలని ప్రేరేపిస్తుందని, ఫలితంగా ఇస్లామ్ అనుయాయులు ఇస్లామేతర రాజ్యంలో విశ్వసనీయపౌరులు కాజాలరని, రాజ్యం పట్ల వారి శ్రేయోభావం ఎప్పటికయినా అనుమానాస్పదమేనని అంటారు. అంతేకాదు, ముస్లిమేతర దేశవాసులతో వారు కలసిమెలసి జీవించలేరని, వారు సుహృద్భావ సంబంధాలు పెంచుకోలేరని, వారు ఉగ్రవాద వైఖరితోనే మెలుగుతారని, ముస్లిమేతరులు వారి నుంచి ప్రేమను, సామీప్యాన్నీ, సదాచార సౌజన్యాలను ఆశించలేరని భయపెడతారు. పైగా ముస్లిమేతరుల ధన, మాన, ప్రాణాలకు అనునిత్యం వారి ద్వారా ముప్పు మూడే ప్రమాదమూ వెంటాడుతూ ఉంటుందని ప్రచారం జరుగుతుంది.

ఈ అభియోగాలు, నిందలను గురించి ప్రపంచమంతటా ప్రాక్ పశ్చిమాల్లో, ఉత్తర దక్షిణాల్లో ఉధృతంగా ప్రచారమయితే జరుగుతోంది. కాని ఎక్కడా ఒక్క నిరూపణనూ ఎవ్వరయినా పొందుపరచిన పాపాన పోలేదు. ముస్లిముల చరిత్ర శతాబ్దుల చరిత్ర, సుదీర్ఘ చరిత్ర. ఈ చరిత్ర అంతటా వెదికినా ఏ ఇస్లామేతర రాజ్యంలోనూ ముస్లిముల ఈ భయంకర పాత్ర కానరాలేదు. అయితే ముస్లిముల ఎడల విద్వేషం, అన్యాయం, అక్రమాల రక్తసిక్తమయిన గాథలు చరిత్ర నమోదుచేస్తూ వచ్చింది. వాస్తవం ఏమిటంటే ఇస్లామ్ ముస్లిములకు వ్యతిరేకంగా ఓ ప్రత్యేకమయిన మనస్తత్వం ఏర్పడి ఉంది. అదొక్కోసారి మెల్లిమెల్లిగాను, మరొక్కోసారి బాహాటంగానూ వినిపిస్తూ ఉంటుంది. వీరిలో, ఇస్లామ్‌కు వ్యతిరేకంగా వేరుగా తమ భావనల

వెల్లడికి జంకు కలుగుతుంది. కాని వారు కూడా ముస్లిమ్‌లను ఏది ఏమయినా ప్రమాదకరమయినవారుగానే తప్పక పరిగణిస్తారు.

మనం చూడవలసింది, ఇస్లామేతర దేశంలో లేదా ముస్లిమేతర సమాజంలో నివసించే ముస్లిములకు ఇస్లామ్ ఎటువంటి నిర్దేశాలిచ్చిందో అన్న విషయం. వారికి ఇస్లామ్ ఇచ్చిన ఆదేశాలేమిటి, చేసిన బోధనలు, ఉపదేశాలేమిటి అన్నది గమనించాలి. దీనిద్వారానే నిర్ణయించడం సాధ్యమవుతుంది. ఏ వ్యక్తి అయినా, ఏ వర్గం అయినా ఇస్లామీయ బోధనల్ని పాటించడం జరిగినట్లయితే వారు ఒక ఇస్లామేతర రాజ్యంలో ఏ పాత్రను పోషిస్తారో అన్నది. వారు దేశానికి విశ్వసనీయుడవుతాడా, విద్రోహి అవుతాడా, శ్రేయోభిలాషి అవుతాడా, చెడును కోరుకునేవాడవుతాడా, దేశ ప్రేమికుడవుతాడా, దేశం పట్ల దుష్ట చింతకుడవుతాడా, దేశంలో వాతావరణాన్ని కల్లోలితం చేస్తాడా, విచ్ఛిన్నపరుస్తాడా వాటిని మెరుగుపరిచే ప్రయత్నం చేసేవాడవుతాడా, అతని శక్తి సామర్థ్యాలు నిర్మాణాత్మకంగా తేలుతాయా దేశానికి విచ్ఛిన్నకరంగా మారుతాయా, ఇతర మతావలంబీకుల ఎడల ఇతని సంబంధాలు ఎలా ఉంటాయి, ఇతని శీల స్వభావాలు, నీతినియమాలు, పోకడలు ఎలా ఉంటాయి?

## ఇస్లామీయ బోధనలు

ఇస్లామేతర రాజ్యంలో లేదా ముస్లిమేతర సమాజంలో నివసించే ముస్లిములకు ఇస్లామ్ ప్రత్యేకమయిన నిర్దేశాలిచ్చింది. వాటిలో ఒకటి, వారు ఎట్టి పరిస్థితిలోనూ తమ విశ్వాసం పట్ల పటిష్ఠంగా ఉండాలి, సాధ్యమయినంతమేర దాని ప్రకారమే జీవించాలి. విశ్వాసాన్ని ఎట్టి పరిస్థితిలోనూ, ఏ సమయాననయినా విడనాడటం జరగదు, అందులో ఏ మార్పులూ, చేర్పులూ జరుగవు. వాటిలో దేన్నీ రద్దుపరచడమూ జరగదు. ఇస్లామ్ ఇచ్చిన ఈ నిర్దేశన, ఈ కాలంలో అంగీకృత సూత్రానికి అనుగుణ్యమయినదే. ప్రతి వ్యక్తికి తన నమ్మకం ప్రకారం నిలకడగా జీవించే అధికారం ఉంది. దాన్ని అమలుపరిచే చట్టపరమయిన హక్కూ ఉంది. ఇది నేటి కాలంలో సర్వ సమ్మతమయిన నియమమే. అందువల్ల ఇస్లామ్ దాని అనుయాయులకు ఈ హక్కును వినియోగించుకునే ఆదేశమిస్తే దీనిపైన ఆక్షేపించడానికి అవకాశం లేదు. ఈ హక్కును వినియోగించుకోవడం అన్నది ఒకరి పట్ల వైషమ్యం చేతనో లేదా శత్రుత్వం మూలంగానో కాదు. అందువల్ల దీనిపట్ల ఆందోళనకు అవసరమే లేదు.

ఇస్లామీయ బోధనల ద్వారా విశదమయ్యే మరో విషయం, ఇస్లామేతర రాజ్యంలో ముస్లిమ్ పౌరుడు, రాజ్యానికీ, తన స్వదేశానికీ చిత్తశుద్ధిగల శ్రేయోభిలాషిగానే మసలుకుంటాడు కాని, ద్రోహిగా లేదా అపనమ్మకవ్యక్తిగా మసలుకోవడం అతని నమ్మకం, ధర్మం ఆచరణలకు విరుద్ధమయిన విషయం. అతను ఏ దేశంలో నివసిస్తాడో అక్కడ ఇస్లామీయ భావనల కనుగుణంగా దాని నిర్మాణం, ప్రగతి, పురోభివృద్ధికి ప్రయత్నించడం అతని బాధ్యత; ఆ దేశ ప్రజలకు సరయిన భావనలు, ఉన్నత నైతికత, పరిశుద్ధ రాజకీయాలను పరిచయం చేయాలి. వారి సమక్షంలో పరమ ప్రభువు, దైవం అవతరింపజేసిన జీవన వ్యవస్థ, అది ప్రతిపాదించే జాతీయ, అంతర్జాతీయ చట్టాలు, వాటిలోని సమతూకం, నిష్పక్షపాతం తదితర విషయాలను సాధారంగా, సహేతుకంగా పెట్టాలి. అది అందజేసిన న్యాయం, సమానత్వం, సమభావాల అనుపమ భావనను, మానవ హక్కుల పట్ల అది చూపిన గౌరవాదరణలను, దాని తాకీదును పరిశీలించాలని, చింతన జరపాలని పిలుపునివ్వాలి. ఆచరణాత్మకంగా ఆ చింతన, ఆచరణల వ్యవస్థను నెలకొలిపేందుకు నీతి, చట్టాల పరిధిలో ఉంటూ కృషి జరపాలి.

ఈ లోకంలో ప్రతి మనిషి కొన్ని ప్రాథమిక హక్కులు కలిగి ఉంటాడు. వాటి పరిరక్షణ అవసరం. అవి లేకుండా అతను సమాజంలో తన పాత్రను పోషించలేడు. నిజానికి ఆ హక్కులే లేకపోతే అనుక్షణం అతని ఉనికే ప్రమాదంలో తేలియాడుతూ ఉంటుంది. ఈ హక్కులపైన చెయ్యిజేసుకున్నట్లయితే, ప్రపంచంలోని ప్రతి నాగరిక చట్టం అతనికి ఆత్మరక్షణకు అధికారం ఇచ్చింది. ఇస్లామ్ సకల చట్టాలకన్నా ముందు ఈ హక్కును అంగీకరిస్తుంది.

ముస్లిములయినవారు తప్పనిసరిగా తమ ధార్మిక నైతిక బాధ్యతల్ని ఎన్నడూ విస్మరించకుండా మెలగడం, తమ సంబంధాన్ని దైవంతో మరీ మరీ పటిష్ఠపరచుకోవడం అత్యంత అవసరం. తద్వారా ముస్లిమ్ వ్యక్తికి జీవితపు చిక్కులతో కూడుకున్న అతి సున్నితమయిన పరిస్థితుల్లో మానసికమయిన శాంతి, నిబ్బరం, సంకల్పనిరతి, ధైర్యసాహసాలు, స్థయిర్యం, నిలకడ ప్రాప్తమవుతాయి. ముస్లిములు స్వయంగానూ దైవభక్తి, దైవభీతిపరాయణమయిన జీవితం గడపాలి, సమాజంలోనూ సదాచారం, దైవభక్తి వాతావరణాన్ని సృజించే ప్రయత్నం చెయ్యాలి. దీనితో పాటు ప్రతి ముస్లిమ్ ఉన్నత నైతికతకు, ఉత్తమ చరిత్రకు ప్రతీకగా నిలువాలి. మానవుణ్ణి మానవునిగానే చూడాలి. అతని హక్కుల్ని గుర్తించాలి, వ్యతిరేక భావాలు, విశ్వాసాలు గలవారితోనూ

ఉత్తమ సంబంధాలు నెలకొలుపుకోవాలి. వారితో సభ్యత, సంస్కారాలతో సౌజన్య శీలతతో, నైతిక నిబద్ధతతో మెలగాలి.

ముస్లిములయిన ప్రతి ఒక్కరు ఈ బోధనల్ని పాటించడానికి బద్ధుడు. ముస్లిమ్ వ్యక్తి ఆలోచనా విధానాన్ని ఎవరయినా విభేదించడం సాధ్యమే, కాని చట్టపరంగా నైతికంగా, ఏ సమాజంలోనయినా అతను తన ఈ పాత్రను పోషించకుండా ఆపడానికి ఎవరికీ ఎటువంటి అవకాశం లేదు.

## ధర్మంలో ప్రాథమిక ఆవశ్యకతలు

ఇస్లామేతర రాజ్యపౌరులుగా జీవించే ముస్లిములకు వారి ధర్మం, విశ్వాసం విషయంలో ఇస్లామ్ చేసిన బోధనల్ని తొలుత పరిశీలిద్దాము. అయితే ఒక మాట ముందే విశదపరచడం అవసరం. ఇస్లామ్ దాని అనుయాయులకు ఇచ్చిన నిర్దేశాలు, వాటి మౌలిక ఆవశ్యకతలు, ప్రవక్త, ఆయన సహచరులు మక్కాలో గడిపిన జీవిత కాలంతోనూ సంబంధం గలవి, మదీనా కాలంతోనూ సంబంధం గలవి. మక్కాలో ముస్లిములు ఒక ఇస్లామేతర సమాజంలో జీవితం గడిపేవారు. మదీనాలో వారు ఇస్లామీయ సమాజం నెలకొని ఉండగా జీవించారు. అందువల్ల ఆ నిర్దేశాల సంబంధం ప్రాముఖ్యత రెండు విధాల సమాజాలలోనూ ఉంది.

## ధర్మంపైన సుస్థిరత

ఇక ఇస్లామేతర రాజ్యంలో ముస్లిమ్ వ్యక్తికి ధార్మికంగా ఎక్కువో తక్కువో, చిన్నవో పెద్దవో భిన్న విధాల సమస్యలు ఎదురవవచ్చు. పరిస్థితులు ఒక్కోసారి చాలా అనుకూలంగా ఉండే అవకాశాలు ఎంతగా ఉంటాయో, అంతగానే అవి అననుకూలంగా ఉండే అవకాశాలూ ఉంటాయి. ఈ సమస్యలు, పరిస్థితుల స్థాయికి, ఇస్లామేతర రాజ్యంలోని చట్టాలు, పాలకుల వైఖరి, సామాన్య ప్రజల నైజంతో గట్టి సంబంధం ఉంటుంది. ఇందులో మరో విషయమూ ఉంది, స్వయంగా ఇస్లామ్ అనుయాయులు తమ ధార్మిక, నైతిక, రాజకీయ స్థాయిని ఎంత మేర పెంచుకున్నారన్న విషయమూ ఇందులో తన పాత్ర పోషిస్తుంది, స్వయంగా వారు తమ సమస్యల్ని పరిష్కరించుకునేందుకు ఏ స్థాయి శక్తి సామర్థ్యాలు కలిగి ఉన్నారన్న విషయమూ ఎంతో బలమయినది.

దివ్య కుర్ఆన్ అన్ని విధాల పరిస్థితుల్లోనూ విశ్వాసులు ధైర్యసాహసాలతో సంకల్ప బలంతో ధర్మంపైన నిలకడ చూపాలని, దాని కనుగుణంగా అమలుజర

పాలని బోధించింది. పరిస్థితులు ఎంతగా విషమించినా, వాతావరణం ఎంతగా హృదయ విదారకమయినా విశ్వాసి ధర్మంపైన సుస్థిరతను, పటిష్ఠతను ధైర్యశౌర్యాలను నిరూపించాలి. పరిస్థితుల తీవ్రతకు, సున్నితతత్వానికి ఆందోళన చెంది ధర్మాన్ని విశ్వాసాన్ని వదలుకోరాదు, లేదా అందులో ఏదయినా ఇచ్చిపుచ్చుకోవడాలు చెయ్యడం ఏ విశ్వాసికీ శోభించదు. దీనికి అవసరమయితే శక్తి మేరకు ఎంత ఉధృతమయిన త్యాగానికయినా వెరువరాదు. మక్కాలో ఎదురయిన అతి క్లిష్టమయిన పరిస్థితుల్లో, కఠిన పరీక్షా సమయంలో మాటిమాటికీ ధర్మంపైన సుస్థిరతను కనబరచాలని ఆదేశించడం జరిగింది. దానికి పరలోక సాఫల్యం స్వర్గప్రాప్తిని శుభవార్తగా తెలుపడం జరిగింది :

إِنَّ الَّذِينَ قَالُوا رَبُّنَا اللَّهُ ثُمَّ اسْتَقَامُوا تَتَنَزَّلُ عَلَيْهِمُ الْمَلَٰٓئِكَةُ أَلَّا تَخَافُوا وَلَا تَحْزَنُوا وَأَبْشِرُوا بِالْجَنَّةِ الَّتِي كُنتُمْ تُوعَدُونَ ۝ نَحْنُ أَوْلِيَآؤُكُمْ فِي الْحَيَوٰةِ الدُّنْيَا وَفِي الْآخِرَةِ ۖ وَلَكُمْ فِيهَا مَا تَشْتَهِيٓ أَنفُسُكُمْ وَلَكُمْ فِيهَا مَا تَدَّعُونَ ۝ (حٰمٓ السجدة: ۳۰،۳۱)

"ఎవరయితే అల్లాహ్ మాత్రమే మా ప్రభువు అని అన్నారో, తరువాత దానిమీద స్థిరంగా నిలకడ చూపారో నిశ్చయంగా వారి కొరకు దైవదూతలు అవతరిస్తారు, వారికి ఇలా చెబుతారు, "భయపడనూరాదు, బాధపడనూరాదు, ఆనందించండి – మీకు వాగ్దానం చేసిన స్వర్గం శుభవార్త పట్ల. మేము ఈ ప్రపంచ జీవితంలోనూ మీకు తోడుగా ఉన్నాము, పరలోకంలోనూ (తోడుగానే ఉంటాము). అక్కడ మీరు ఏది కోరుకున్నా అది మీకు ప్రాప్తమవుతుంది. అక్కడ మీరు దేన్ని ఆశిస్తే అది మీకు స్వంతమయిపోతుంది. ఇదీ క్షమాశీలుడు, కరుణామయుడు అయిన స్వామి ద్వారా ప్రాప్తించే ఆతిథ్యం."

(హా మీమ్ అస్సజ్దహ్ : **30, 31**)

ప్రతికూల వాతావరణంలో స్థైర్యం కనబరచడం పట్ల స్వర్గప్రాప్తికి సంబంధించిన ఇదే శుభవార్త మరోచోట ఇలా అందజేయడం జరిగింది :

إِنَّ الَّذِينَ قَالُوا رَبُّنَا اللَّهُ ثُمَّ اسْتَقَامُوا فَلَا خَوْفٌ عَلَيْهِمْ وَلَا هُمْ يَحْزَنُونَ ۝ أُولَٰٓئِكَ أَصْحَٰبُ الْجَنَّةِ خَٰلِدِينَ فِيهَا ۚ جَزَآءً بِمَا كَانُوا يَعْمَلُونَ ۝ (الاحقاف: ۱۳،۱۴)

నిశ్చయంగా ఎవరయితే అల్లాహ్ మాత్రమే మా ప్రభువు అని అన్నారో, దానిమీద నిలకడ చూపారో వారికి ఎటువంటి భయమూ లేదు, వారు దుఃఖపడవలసిన అవసరమూ లేదు. ఇలాంటి జనులు సర్వం స్వర్గంలోకి చేరవలసినవారే, అక్కడ వారు సర్వదా ఉంటారు- వారు ప్రపంచంలో చేస్తూ ఉన్న ఆచరణలకు ప్రతిఫలంగా. ***(అల్ అహ్కాఫ్ : 13, 14)***

దైవధర్మంపైన నిలకడకు ఒక రూపం ఏమిటంటే, మనిషి ప్రతికూల వాతావరణంలో దైవ ధర్మం వైపునకు పిలుపునివ్వాలి, నిరంతరం ఇస్తూనే ఉండాలి. అది సత్యమయినదని నిరూపించాలి. దాని గురించి ఏర్పడిన సందేహాలు, సంశయాలు, అపోహలు, అపార్థాలను తొలగించాలి. అదే ఇహపరాల సాఫల్యానికి ఏకైక మార్గమన్న సత్యాన్ని రూఢపరచి జనుల్ని సంతృప్తపరచడానికి కృషి చెయ్యాలి. అష్షూరా సూరా మక్కాలో అవతరించిన సూరా. అందులో ఒక విషయం విశద పరచడం జరిగింది. మహా మహులయిన దైవప్రవక్తలు ప్రపంచంలో ఆవిర్భవించిన వారంతా అందరికీ 'ధర్మ సంస్థాపనా' ఆదేశమే ఇవ్వబడింది. ఇదే ఆదేశాన్ని మహనీయ ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లమ్)కూ ఇవ్వబడింది. గతించిన జాతులు ఈ బోధనలు, ఆదేశాన్ని విస్మరించాయి. (42. అష్షూరా : 13, 14) ఆ తరువాత ఇలా సెలవీయడం జరిగింది :

فَلِذٰلِكَ فَادْعُ ۚ وَاسْتَقِمْ كَمَآ اُمِرْتَ ۚ وَلَا تَتَّبِعْ اَهْوَآءَهُمْ ۚ وَقُلْ اٰمَنْتُ بِمَآ اَنْزَلَ اللّٰهُ مِنْ كِتٰبٍ ۚ وَاُمِرْتُ لِاَعْدِلَ بَيْنَكُمْ ؕ اَللّٰهُ رَبُّنَا وَرَبُّكُمْ ؕ لَنَآ اَعْمَالُنَا وَلَكُمْ اَعْمَالُكُمْ ؕ لَا حُجَّةَ بَيْنَنَا وَبَيْنَكُمْ ؕ اَللّٰهُ يَجْمَعُ بَيْنَنَا ۚ وَاِلَيْهِ الْمَصِيْرُ ۝ (الشورى:١٥)

"ఈ పరిస్థితి ఎలాగూ నెలకొన్నది గనుక ముహమ్మద్, ఇక నీవు ఆ ధర్మం వైపునకే పిలుపు నివ్వు. నీకు ఆదేశించిన విధంగా దాని మీదనే పటిష్ఠంగా స్థిరపడు, ఈ జనుల కోరికలను అనుసరించకు, వీరికి చెప్పివెయ్యి, "అల్లాహ్ అవతరింపజేసిన గ్రంథం ఏదయినా నేను దాన్ని విశ్వసిస్తున్నాను. మీ మధ్యన న్యాయం చెయ్యాలని నన్ను ఆదేశించడమయినది. అల్లాహ్ మటుకే మా ప్రభువూ మీ ప్రభువు కూడా. మా ఆచరణలు మాకూను. మీ ఆచరణలు మీకే వర్తిస్తాయి. మాకూ మీకూ మధ్య ఎటువంటి వాదులాటలేదు. అల్లాహ్

ఒక రోజున మనల నందరినీ ఏకత్రం చేస్తాడు, మరాయన వైపునకే అందరూ వెళ్ళవలసి ఉంది." (అష్షూరా : 15)

ఈ ఆయత్ ద్వారా ఒకమాట ద్యోతకమవుతుంది. ఇస్లామేతర రాజ్యంలో సందేశ ప్రచారం, ఇస్లామ్ తన ప్రాథమిక హక్కుగా పరిగణిస్తుంది. అది, దానికి ఆ హక్కు ప్రాప్తమయి ఉండాలని కోరుకుంటుంది. తద్వారా ఇస్లామ్‌ను దైవధర్మం రూపంలో ఏ వ్యక్తిఅయినా గ్రహించి స్వీకరించదలిస్తే అతని మార్గంలో ఎటువంటి అవాంతరం ఉండరాదన్నది దాని ఉద్దేశ్యం. నేటి కాలంలో ఈ వాస్తవాన్ని సర్వసామాన్యంగా స్వీకరించడం జరిగింది. ఏ విశ్వాసాన్నయినా స్వీకరించడం, దానికనుగుణంగా అమలుజెయ్యడం, దాన్ని ప్రచారం చెయ్యడం ప్రతి పౌరుని ప్రాథమిక హక్కుగా పరిగణించడం జరుగుతోంది.

ఈ ఆయత్ ద్వారా సందేశ ప్రచారానికి సంబంధించిన కొన్ని ప్రాథమిక సూత్రాలూ ముందుకు వస్తున్నాయి. వాటిని పరిశీలించి పాటించడమూ అవసరమే. ఇందులో ప్రథమంగా ఇస్లామేతర వాతావరణంలో ఇస్లామ్ సందేశం అందజేసే, ఇస్లామ్‌పైన స్థయిర్యం కనబరిచే ఆదేశముంది. ఆ తరువాత ప్రతికూల శక్తుల కోరికల్ని అనుసరించరాదన్న నిర్దేశన ఉంది. మరోమాటలో వారిని సంతోషపరచడానికి తన నమ్మకం, ఆలోచనలను వదలుకోవడం తప్పని సూచించడం జరిగింది. సందేశ ప్రచారంలో వాదోపవాదాలు, పిడివాదం వంటి వైఖరిని అవలంబించరాదు. నమ్మకం ఆలోచనల విషయంలో ప్రతి ఒక్కరి స్వేచ్ఛ, ఆ హక్కును స్వీకరించాలి. విశ్వాసపు విభేదాలయినా సామూహిక జీవన వ్యవహారాలు సమస్యలయినా వీటన్నింటిలో న్యాయం సమతూకం విధానాన్ని పాటించాలి. ఈ ఆయత్‌లో ఇంకా కొన్ని నిర్దేశాలూ ఉన్నాయి. ఒక ముస్లిమ్ వ్యక్తి వీటిలో ప్రతి ఒక్కదాన్నీ పాటించడానికి బద్ధుడు. ఇవి ఎంతో సహేతుకమయిన, సమంజసమయిన బోధనలు. నేటి కాలంలోని ఏ మహా హేతువాది అయినా వీటిలో ఏ ఒక్కదాన్నీ తప్పయినదిగా నిర్ణయించలేడు.

## ధర్మంలో మార్పు సంభవం కాదు

ఇస్లామేతర రాజ్యంలో ధర్మాన్ని మార్చడానికీ దాన్ని రూపుమాపడానికి ప్రయత్నం జరగవచ్చు. తద్వారా దాని ప్రత్యేకత, అనన్యత మిగులకుండాపోయి, అది ఇస్లామేతర ఆలోచనా విధానంలో సభ్యతా సంస్కారాలతో సామరస్యత చెందేలా కృషి జరగవచ్చు. దీనిగ్గాను అధికార వర్గం తన ఆకాంక్షలకనుగుణంగా ధర్మానికి

కారణ హేతువులూ, వ్యాఖ్యానాలూ రూపొందించి వాటిని స్వీకరించేందుకు వివశులుగా చెయ్యవచ్చు. దీనికి ఈ అవకాశం దొరక్కపోతే విజ్ఞత, వివేచనలు దీనికి అనుమతించకపోతే స్వయంగా ధర్మావలంబీకుల సమక్షంలో తాము కోరే సంస్కరణ, మార్పులు చేర్పుల ఆవశ్యకత ముందుంచి వాటిని ఒప్పించడమూ సాధ్యమే. ఇదేదో వింతయిన విషయం కాదు. దీనిగ్గాను ఆర్థిక, రాజకీయ వత్తిడి, ప్రోత్సాహకాలు, పేరాశలు పెంచడం, చట్ట నిర్మాణంతో పాటు అనేక కుయుక్తులు అవలంబించడం సాధ్యమే. ఇది మతపరమయిన బలాత్కారానికి అత్యంత హేయమయిన రూపం. దీన్ని ఇస్లామ్ ఎన్నడూ స్వీకరించదు. కాగా అరబ్బు ముష్రికులు, కుర్‌ఆన్‌లో మార్పులు చేసి వారి మిథ్యావిశ్వాసాలకు సయితం అందులో చోటు కల్పించాలని కోరేవారు. అలాఅయితే అది వారికి స్వీకారయోగ్యమవుతుందని అడిగేవారు. కుర్‌ఆన్ ఈ కోరికను పూర్తిగా త్రోసిపుచ్చింది. దైవగ్రంథంలో ఒక్క పదమూ మార్పు చేర్పు చెయ్యడం జరగదని, సవరణో సంస్కరణో సాధ్యపడదని ఖచ్చితంగా చెప్పివేసింది. కుర్‌ఆన్ అనుయాయులు దీని అనుసరణకు బద్ధులు. కుర్‌ఆన్‌ని మార్చే హక్కు అల్లాహ్ వారికి సుతరామూ ఇవ్వలేదు. ఇలా సెలవీయడం జరిగింది :

وَاِذَا تُتْلٰى عَلَيْهِمْ اٰيٰتُنَا بَيِّنٰتٍ ۙ قَالَ الَّذِيْنَ لَا يَرْجُوْنَ لِقَآءَ نَا ائْتِ
بِقُرْاٰنٍ غَيْرِ هٰـذَآ اَوْ بَدِّلْهُ ؕ قُلْ مَا يَكُوْنُ لِيْٓ اَنْ اُبَدِّلَهٗ مِنْ تِلْقَآئِ
نَفْسِيْٓ ۚ اِنْ اَتَّبِعُ اِلَّا مَا يُوْحٰٓى اِلَيَّ ۚ اِنِّيْٓ اَخَافُ اِنْ عَصَيْتُ رَبِّيْ
عَذَابَ يَوْمٍ عَظِيْمٍ ○ (یونس:۱۵)

వారికి అతి స్పష్టమయిన మా మాటలను వినిపించినప్పుడు, మమ్మల్ని కలుసుకునే ఆశలేనివారు, "ఇది కాక మరే ఖుర్‌ఆన్‌నయినా తీసుకురండి, లేదా ఇందులో ఏదయినా సవరణ చెయ్యండి," అని అంటారు. ముహమ్మద్, వారికి చెప్పు, "ఇందులో నా తరఫున ఏవయినా మార్పులు చేర్పులు చేసుకోవడం నా పని కాదు, నేను కేవలం నా వద్దకు పంపించే వహీని అనుసరించేవాడిని మాత్రమే. నేను నా ప్రభువుకు అవిధేయత చూపినట్లయితే ఒక మహా విపత్కర దినాన దాపురించే శిక్ష భయం నాకుంది."

**(యూనుస్ : 15)**

ఈ వ్యవహారంలో దైవ సందేశహరులు (స) పైన బహుదైవారాధకుల వైపుగా బలమయిన ఒత్తిడి ఉండేది. రకరకాల ఉపాయాలు వారు చేసేవారు. కాని అల్లాహ్ ఆయనకు తన ప్రత్యేక అనుగ్రహం చేత పటిష్ఠతను ప్రసాదించాడు. ఆయన ఏమాత్రం తన స్థాయి నుంచి వెనక్కి తగ్గలేదు. ఈ వైఖరి ముస్లిమ్ సముదాయానికి బోధన వంటిది. ఇటువంటి పరిస్థితుల్లో వారు సుస్థిరమయిన, పటిష్ఠతను ప్రదర్శించాలని. ప్రతికూల శక్తులకు లొంగిపోవడం మహా నష్టం కలిగించే నేరమవుతుందని బోధించడం జరిగింది :

وَاِنْ كَادُوْا لَيَفْتِنُوْنَكَ عَنِ الَّذِىْٓ اَوْحَيْنَآ اِلَيْكَ لِتَفْتَرِىَ عَلَيْنَا
غَيْرَهٗ ۖ وَ اِذًا لَّا تَّخَذُوْكَ خَلِيْلًا ○ وَلَوْلَآ اَنْ ثَبَّتْنٰكَ لَقَدْ كِدْتَّ
تَرْكَنُ اِلَيْهِمْ شَيْـًٔا قَلِيْلًا ۙ اِذًا لَّاَذَقْنٰكَ ضِعْفَ الْحَيٰوةِ وَ ضِعْفَ
الْمَمَاتِ ثُمَّ لَا تَجِدُ لَكَ عَلَيْنَا نَصِيْرًا ○ (بنی اسرائیل:۷۳-۷۵)

"ముహమ్మద్, శక్తివంచన లేకుండా ప్రయత్నాలు జరిగాయి- నిన్ను ఉపద్రవ పరీక్షలో పడవేసి, మేము నీ వద్దకు పంపిన వహీ నుండి నిన్ను మరల్చివేయ దానికి; తద్వారా నీ అంతట నీవు వేరే ఏదయినా మాట మా పేరిట కల్పించాలని చూశారు. నీవు అలా చేసి ఉన్నట్లయితే వారు నిన్ను తప్పకుండా తమ మిత్రునిగా చేసుకునేవారే. మేము నిన్ను సుస్థిరపరచి ఉండకపోతే నీవు వారి వైపునకు ఎంతో కొంత మ్రొగ్గిపోవడం కూడా జరిగేదే. కాని నీవు అలా చేసి ఉన్నట్లయితే మేము నీకు ప్రపంచంలోనూ రెండింతల యాతనను చవిచూపేవారము, పరలోకంలోనూ రెండింతల యాతన లభించేది, అప్పుడు నీవు మాకు ప్రతిగా ఏ సహాయకుడినీ పొందేవాడివి కావు."

*(బనీ ఇస్రాయీల్ : 73-75)*

పరమ ప్రభువు తన ధర్మంలో ఎటువంటి మార్పూ చెయ్యలేదు, దాని అనుయాయులకూ అనుమతీ ఇవ్వలేదు, మరెవరికీ ఇవ్వలేదు. ఇటువంటి కోరిక ఎవరు కోరినా ప్రతి కోరికనూ తిరస్కరించాలని, ఇటువంటి ఏ కృషి జరిగినా దాన్ని వమ్ముచెయ్యాలని విశ్వాసుల సముదాయానికి బాధ్యత అప్పగించబడింది.

## అమ్ర్ బిల్ మా'రూఫ్ నహీ అనిల్ మున్కర్

ప్రపంచంలో ముస్లిమ్ నిర్వహించవలసిన పాత్రను 'అమ్ర్ బిల్ మా'రూఫ్, నహీ అనిల్ మున్కర్' అని నిర్వచింపబడింది. ఇది ఎంతో గొప్పది, విస్తృతమయింది, బహుముఖమయింది. 'మా'రూఫ్' అన్న పదంలో సరయిన విశ్వాసం, చింతన, ఉన్నత నైతికత, మానవ హక్కులు, సమానత్వం, న్యాయం వంటి సకల ఉత్తమ లక్షణాలు పరిగణనలోకి వస్తాయి. దైవధర్మంలో గుర్తింపు పొందిన మంచి గుణాలు పనులూ అన్నీ చేరి ఉన్నాయి; ఇంకా వీటిలో సామాన్య బుద్ధివివేకాలు, మానవ నైజం మంచివని నిరూపించే, సాక్ష్యమిచ్చేవన్నీ చేరి ఉన్నాయి. వీటన్నింటికీ భిన్నంగా విరుద్ధంగా అవలంబించే ఆలోచన, ఆచరణల వైఖరిని 'మున్కర్' అనడం జరిగింది. ఇందులో మిథ్యా నమ్మకాలు, మిథ్యా ఆలోచనలు, తప్పుడు నైతికతలు, మానవుని లేదా మానవాళిలో ఏ వర్గాన్నయినా అవమానించడం, ఏవర్గంపైనయినా బలవంతం, హింస, అక్రమం, అన్యాయం జరపడం వంటి పాత్ర చేరి ఉన్నాయి. ఈ పాత్రకు దైవధర్మంలో గుర్తింపు లేదు. దీన్ని మనం బుద్ధివివేకాలు, మానవ నైజం అయిష్టకరమయినవిగా, తప్పయినవిగా నిర్ణయిస్తాయి.

'అమ్ర్ బిల్ మా'రూఫ్, నహీ అనిల్ మున్కర్' కార్యంలో ప్రప్రథమ ఆవశ్యకత, ప్రపంచానికి బహుదైవారాధన, దైవతిరస్కారం, నాస్తికత్వం ద్వారా ప్రాప్తమయ్యే నష్టాలను గురించి ఎరుకపరచడం. దాని స్థానే, స్వచ్ఛమయిన దేవుని ఏకత్వం భావనను సాధారంగా ప్రపంచానికి అందజేయాలి. నేడు సమస్త ప్రపంచాన్ని భౌతికవాదం దాని ఉక్కు పంజాలో మా చెడ్డగా బంధించిపెట్టింది. మానవుని మానసిక ఆలోచనాత్మక శిక్షణ సంపూర్ణమయిన భౌతిక దృక్కోణంతోనే జరుగుతోంది. అతని నైతిక, సామాజిక, ఆర్థిక, రాజకీయ రంగాలన్నీ భౌతికవాదం అండనే శ్వాస పీలుస్తున్నాయి. వ్యక్తిగత, వర్గపరమయిన ప్రయోజనాలు పరస్పర ఘర్షణపడటం వల్ల ప్రపంచం నరకతుల్యమయిపోయింది. ఆధ్యాత్మిక, నైతిక ప్రమాణాలు అతి హీనంగా కాలరాయబడుతున్నాయి. చిత్రం చాలా ఘోరంగా ఉంది. ప్రతి వ్యక్తి, ప్రతి వర్గం, అన్యాయానికి, అక్రమానికి, దౌర్జన్యానికి, వంచనకు, మోసానికి జంకుగొంకు లేకుండా పాల్పడుతున్నట్లు, దాన్నే తన మార్గంగా ఎంచుకున్నట్లు, మానవహక్కులు అడుగడుగునా అడుగంటి పోతున్నట్లు బాహాటంగానే కానవస్తోంది.

దీనికి భిన్నంగా ఇస్లామ్ మానవుని భౌతిక, ఆధ్యాత్మిక అవసరాలను ఉత్తమ రీతిలో పరిపూర్ణం చెయ్యడమే కాక వాటిని సమంజసంగా వికసింపనూజేసింది.

దాని మౌలిక భావన ప్రకారం మానవులంతా దేవుని దాసులు, వారంతా ఆయనకే దాస్యం. ఆరాధన చెయ్యాలి, ఆయన ఆజ్ఞాబద్ధులయే జీవించాలి. ఇస్లామ్ ఏ జాతి, ఏ దేశానికీ చెందిన ధర్మం కాదు. అది ప్రతి వ్యక్తినీ సంబోధిస్తుంది. అది ప్రతి ఒక్కరి కొరకు ఇహపరలోకాల ద్వారాలు తెరుస్తుంది. అది నిజంగా మానవునికి కారుణ్య ధర్మం.

అమ్ర్ బిన్ మా'రూఫ్ అంటే ప్రపంచానికి, సత్యం, శ్రేయం, శాంతి, సుఖం, నమ్మకం, భరోసా, సౌశీల్యం, ఇంకా సమస్త పవిత్ర నైతిక సుగుణాలను బోధించడం. ఇంకా అమ్ర్ బిల్ మా'రూఫ్ అంటే ఒండొకరి హక్కుల్ని గుర్తించాలి, వాటిని నిర్వర్తించాలి, నిర్వర్తించే ప్రేరణ కల్పించాలి. ఒక్కొక్క వ్యక్తి మనో మేధస్సుల్లో కొన్ని సత్యాలను పాదుపరచాలి. ప్రపంచంలోని ప్రతి వ్యక్తికి కొన్ని హక్కులున్నాయి, ఆ హక్కుల్ని కాపాడటం తప్పనిసరిగా అవసరం. బంధువులు, సన్నిహితుల హక్కులే కాదు, పొరుగువారు, ఆగంతకులు, బాటసారులు, నమ్మకాలు, విశ్వాసాలు వేరయిన వారు, విభిన్న మతాలవారు స్వదేశీయులు, పరదేశీయులు – వీరందరి హక్కులున్నాయని గుర్తించాలి. వారి ధన, మాన, ప్రాణాలు సయితం పరిరక్షింపబడాలి. దీనికి భిన్నంగా అబద్ధం, అపనమ్మకం, వాగ్దానభంగం, అశ్లీలం, వ్యభిచారం వంటి దిగజారిన నైతిక ఆచరణలన్నీ మున్కర్‌గా పరిగణించబడతాయి. ఇదేవిధంగా దౌర్జన్యం, హక్కులు కాలరాయడం, చేసిన మేలు మరువడం, రక్తపాతం, హత్యాకాండ, వినాశం, మానవ హక్కుల హరణం మొదలయినవన్నీ మున్కరులుగానే పరిగణించబడతాయి, వీటినన్నింటినీ ఆపడానికి ప్రయత్నం చేయాలి.

ముస్లిమ్ సముదాయం ఈ మహత్తర విధిని నిర్వర్తించడానికి సన్నద్ధమయి నిలబడాలని ఇస్లామ్ కోరుతుంది. సముదాయంలోని ప్రతి వ్యక్తి దీనిగ్గాను తన శక్తిని, ప్రభావాలను సాధ్యమయినంత మేర వినియోగించాలని అది అభిలషిస్తుంది. ఎవరయితే కేవలం హితవు, బోధన గరపగలడో అతను అదీ చేయాలి; ప్రజల్లో దీనిగ్గాను ప్రేరణ, ఉత్సాహం ఏర్పరచి మంచిని విస్తృత పరచాలి, అలాగే చెడుగుల్ని అంతమొందించాలి. మరెవరయితే శిక్షణ గరిపే అవకాశం పొందుతారో వారు ఆ మార్గానే ఈ విధి నిర్వహణ చెయ్యాలి. అంటే, ముస్లిములు ఏ ఏ కార్యపరిధుల్లోనయితే 'అమ్ర్ బిల్ మా'రూఫ్ నహీ అనిల్ మున్కర్' బాధ్యతను నిర్వర్తించగలడో, ఆయా పరిధుల్లో దాన్ని తప్పనిసరిగా నిర్వర్తించాలి. దీని నిమిత్తమయి సమయం ఏర్పడినప్పుడు వ్యక్తిగత, సామాజిక ప్రభావం, రాజకీయ శక్తినీ వినియోగించడం

కూడా సరయినదే. ఒకరు తన ఇంటివారలకు కుటుంబం వారలకు మంచికి బద్ధులయినవారుగా చెడుకు దూరమయినవారుగా మలచడం చెయ్యగలుగుతారు. మరొకరెవరయినా తన బస్తీలో వాడలో మారూఫ్ వ్యవస్థలు స్థాపించగలిగి చెడుల్ని రూపుమాపగలుగుతారు. మరొకరు తమ నగరంలో దీన్ని అమలుజరపగల స్థోమతగలిగి ఉంటారు. ఇంకా కొందరు ప్రభుత్వ స్థాయిలో దీన్ని నిర్వర్తించగల శక్తి కలిగి ఉంటారు.

ఇస్లామ్ బోధన ఏమిటంటే ముస్లిమ్ సముదాయం 'అమ్ర్ బిల్ మా'రూఫ్ నహీ అనిల్ మున్కర్' బాధ్యతా నిర్వహణకు లేచి నిలబడాలి. అందులోని ప్రతి వ్యక్తి సదాచరణలకు సానుకూలమయిన వాతావరణాన్ని సృజించాలి; చెడులకు అడ్డుకట్ట వెయ్యగలగాలి. ఈ పరిస్థితులు కల్పించడానికి శాయశక్తులా కృషి సలపాలి. ఈ మహత్కార్యం, సముదాయం ఇస్లామీయ రాజ్యంలోనూ నిర్వర్తించాలి, ఇస్లామేతర రాజ్యంలోనూ నిర్వర్తించాలి. ఇదే దీని ప్రత్యేక వ్యక్తిత్వపు గుర్తింపు సిద్ధమవుతుంది, మనగలుగుతుంది, దీని ద్వారానే అది దైవ కారుణ్యానికి పాత్రమవుతుంది.

## న్యాయ స్థాపన

ఇస్లామ్, ఎట్టిపరిస్థితిలోనూ న్యాయంపైన నిలకడకు, న్యాయానికి కట్టుబడి ఉండటానికి ఆదేశమిస్తుంది :

قُلْ اَمَرَ رَبِّىْ بِالْقِسْطِ (الاعراف:٢٩)

"చెప్పివెయ్యి, నా ప్రభువు న్యాయాన్ని ఆదేశించాడు." *(అల్ ఆరాఫ్ : 29)*

మరోచోట ఇలా ఉంది :

اِنَّ اللّٰهَ يَاْمُرُ بِالْعَدْلِ وَالْاِحْسَانِ وَ اِيْتَآءِ ذِى الْقُرْبٰى وَيَنْهٰى عَنِ الْفَحْشَآءِ وَالْمُنْكَرِ وَالْبَغْيِ يَعِظُكُمْ لَعَلَّكُمْ تَذَكَّرُوْنَ○(النحل:٩٠)

"అల్లాహ్ న్యాయబద్ధతను, అనుగ్రహశీలతను, బంధుత్వ అనురాగాన్నీ (పాటించాలని) ఆదేశిస్తున్నాడు, చెడుల నుండి, సిగ్గుమాలిన పనుల నుండి, దౌర్జన్యం, అత్యాచారాల నుండి వారిస్తున్నాడు. మీరు గుణపాఠం గ్రహించాలని మీకు హితవు గరుపుతున్నాడు." *(అన్ నహ్ల్ : 90)*

ఇక్కడ న్యాయం, ఉత్తమ ఆచరణల ఆదేశంతో పాటు ధిక్కారం దౌష్ట్యాలను

వారించడమూ జరిగింది. ఈ ఆదేశం, వారింపుల మధ్య అవినాభావ సంబంధ ముంది. న్యాయం ఉన్నచోట దౌర్జన్యం అడుగుమోపజాలదు, మరెక్కడయితే దుర్మార్గం రాజ్యమేలుతుందో అక్కడ న్యాయం నిలువజాలదు. ఇస్లామ్ దాని అనుయాయుల్ని, ప్రపంచంలో న్యాయం ధర్మాలను గురించి సాక్ష్యం పలికేటటువంటి సముదాయంగా, దైవధర్మానికి ధ్వజవాహకులయ్యేవారుగా తీర్చిదిద్దింది. వారిని ఏ వ్యక్తిపైనయినా ఏ వర్గంపైనయినా చెయ్యెత్తేందుకు అది సుతరామూ అనుమతించదు. ఎదుటివారు ఎంతగా విభేదించినా, వారు ఎన్ని అక్రమాలు చేసినా వారిపైన అన్యాయం జరిపేం దుకు అనుమతి లేదు. న్యాయం, ధర్మం అన్నవి దైవభీతి, ధర్మనిష్ఠకు చిహ్నాలు. ముస్లిమ్ అయిన వ్యక్తి ఎట్టి పరిస్థితిలోనూ ధర్మనిష్ఠ, దైవభక్తి మార్గాన్ని విడనాడలేదు. దివ్య కుర్ఆన్‌లో ఈ మాట అతి స్పష్టంగా విశదపరచబడింది :

يٰٓاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا كُوْنُوْا قَوّٰمِيْنَ لِلّٰهِ شُهَدَآءَ بِالْقِسْطِ ۡ وَ لَا
يَجْرِمَنَّكُمْ شَنَاٰنُ قَوْمٍ عَلٰٓى اَلَّا تَعْدِلُوْا ؕ اِعْدِلُوْا ۟ هُوَ اَقْرَبُ لِلتَّقْوٰى ۡ
وَاتَّقُوا اللّٰهَ ؕ اِنَّ اللّٰهَ خَبِيْرٌۢ بِمَا تَعْمَلُوْنَ ○ (المائدة:٨)

"విశ్వసించిన జనులారా, అల్లాహ్ కొరకు నిజాయితీపై నిలకడగలవారయి, న్యాయానికి సాక్ష్యం పలికేవారయి నిలువండి. ఒక వర్గం పట్ల గల శత్రుత్వం మిమ్మల్ని మరీ ఆగ్రహానికి గురిచేసి న్యాయవిరుద్ధంగా ప్రవర్తింపజేయరాదు. న్యాయబద్ధులయి వ్యవహరించండి, ఇది దైవభక్తిపరాయణతకు మరింత యుక్తమయిన వైఖరి. అల్లాహ్‌కు భయపడుతూ మెలగండి, మీరు చేసేదంతా అల్లాహ్‌కు పూర్తిగా తెలుసు. *(అల్ మాఇద : 8)*

దివ్య కుర్ఆన్ ఈ విషయాన్నీ విడమర్చి తెలిపింది, ఒక జాతి దైవ అవిధేయత, అన్యాయం, అక్రమాల మార్గాన్ని అవలంబిస్తే అల్లాహ్ దానికి ఓ ప్రత్యేక సమయం వరకు వ్యవధినిస్తాడు. ఆపైన దాని గడువు ముగుస్తుంది, అప్పుడు అది దైవశిక్షకు పాత్రమవుతుంది. దీనికి ఆధారంగా కుర్ఆన్ చారిత్రక నిరూపణలు అందజేస్తుంది:

وَكَذٰلِكَ اَخْذُ رَبِّكَ اِذَآ اَخَذَ الْقُرٰى وَهِىَ ظَالِمَةٌ ؕ اِنَّ اَخْذَهٗٓ
اَلِيْمٌ شَدِيْدٌ ○ (هود:١٠٢)

"మరి నీ ప్రభువు ఏదయినా అత్యాచార నగరాన్ని పట్టుకున్నప్పుడు ఆయన పట్టు ఇలాగే ఉంటుంది." *(హూద్ : 102)*

దైవ సందేశహరులు ఈ అల్లాహ్ సంప్రదాయాన్ని ఈ పదాలలో అభివర్ణించాడు :

إِنَّ اللّٰهَ لَيُمْلِىْ لِلظَّالِمِ حَتّٰى إِذَا اَخَذَهٗ لَمْ يُفْلِتْهُ(1)

"నిస్సందేహంగా అల్లాహ్ దుర్మార్గునికి తప్పనిసరిగా వ్యవధినిస్తాడు. కాని అతన్ని పట్టుకుంటే మరి వదలడు." (బుఖారి, కితాబుత్తఫ్సీర్ (హూద్ సూరా); బాబ్ కజాలిక అఖజ్ రబ్బికల్ ఆయాత్ (ముస్లిమ్, కితాబుల్ బిర్ర్ వస్సిలా, బాబ్ తహ్రీముజ్జుల్మ్)

దైవ సందేశహరులు బాధితుని హాహాకారానికి దూరంగా మెలగమని తాకీదు చేశారు. ఆయన (స) హజ్రత్ మఆజ్ (రజి)ని యమన్ గవర్నర్‌గా నియమిస్తూ పంపినప్పుడు, కొన్ని హితోపదేశాలు చేశారు. వాటిలో ఒకటి ఇది :

وَاتَّقِ دَعْوَةَ الْمَظْلُوْمِ فَإِنَّهٗ لَيْسَ بَيْنَهَا وَ بَيْنَ اللّٰهِ حِجَابٌ

"బాధితుని వేడుకోలును తప్పించుకో, ఎందుకంటే అతని వేడుకోలుకూ అల్లాహ్‌కు మధ్య ఎటువంటి చాటు మిగులదు." (బుఖారి : కితాబుల్ మజాలిమ్; ముస్లిమ్ : కితాబుల్ ఈమాన్)

హజ్రత్ అలీ (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవ సందేశహరులు ఇలా బోధించారు:

إِيَّاكَ دَعْوَةَ الْمَظْلُوْمِ فَإِنَّمَا يَسْأَلُ اللّٰهَ تَعَالٰى حَقَّهٗ وَ إِنَّ اللّٰهَ لَا يَمْنَعُ ذَا حَقٍّ حَقَّهٗ(٢)

'బాధితుని వేడుకోలును తప్పించుకోండి, అతను అల్లాహ్ నుండి తన హక్కును కోరుతాడు. మరేమో అల్లాహ్ ఏ హక్కుదారునీ అతని హక్కుకు వంచితుడు చెయ్యడు. (మిష్కాత్ : కితాబుల్ ఆదాబ్, బాబుజ్జుల్మ్, బైహకీ ఉటంకింపు)

ఇదే విషయం గల మరో హదీసులో ఇలా ఉంది :

"బాధితుని వేడుకోలును తప్పించుకోండి, అతను ముస్లిమేతరుడయినా సరే." (మనాలి : అత్తయ్‌సీర్, బిషర్హిల్ జామ'స్సగీర్ : 1-405)

భావమేమిటంటే బాధితుడెవడయినా, అతనిపైన ఎటువంటి అక్రమం జరిగినా, అల్లాహ్ అతని వేడుకోలు తప్పక వింటాడు, అతనికి తప్పక సహాయపడ

తాడు.

తనకు దుర్మార్గునికి ఎదురుగా నిలువడానికి శక్తి లేదన్న భావంతో బాధితుడు అల్లాహ్‌కు మొరపెట్టుకుంటే, అల్లాహ్ మాత్రమే తనకు సహాయపడగలడని, అతని హక్కుల్ని పరిరక్షించగలడని వేడుకుంటే అల్లాహ్ సన్నిధానంలో అతని వేడుకోలు ఎటువంటి అడ్డంకి లేకుండా చేరుతుంది. అతని కోసం దైవసన్నిధిలో స్వీకార ద్వారాలు తెరచుకుంటాయి. పరమ ప్రభువు ఏ హక్కుదారుని హక్కునూ కాదనడు.

మరో హదీసులో అక్రమం చెయ్యడమే కాదు, దుర్మార్గునికి తోడ్పాటునివ్వడం, వానికి మద్దతు అందజెయ్యడం, బలం చేకూర్చడం పట్ల కూడా కఠోర అభిశాపం ముందుకు వచ్చింది. హజ్రత్ ఔస్ బిన్ షర్జీల్ (రహ్మ) ప్రకారం ప్రవక్త మహనీయులు (స) ఇలా సెలవిచ్చారు :

مَنْ مَّشٰى مَعَ ظَالِمٍ لِيُقَوِّيَهُ وَهُوَ يَعْلَمُ اَنَّهُ ظَالِمٌ فَقَدْ خَـرَجَ مِنَ الْاِسْلَامِ(۱)

**'ఎవరయితే ఒక దుర్మార్గునికి తోడివ్వడానికి, అతను దుర్మార్గుడని తెలిసీ, అతనితోపాటు నడచినా అతను ఇస్లామ్ (పరిధి) నుండి వెలికిపోయినట్లే.' (మిష్కాత్: కితాబుల్ ఆదాబ్, బాబుజ్జుల్మ్, బైహకీ ఉటంకింపు)**

దీని భావమేమిటంటే, అంతా ఎరిగీ అన్యాయాన్నీ అక్రమాన్నీ సమర్థించడం, దుర్మార్గునికి తోడ్పాటుగా నిలువడం ఒక ముస్లిమ్ వ్యక్తికి శోభించదు. ఇది విశ్వాసుల వైఖరికి ఎంతమాత్రం తగదు. అన్యాయాన్ని సమర్థించి మనిషి ముస్లిముల విధానానికి విముఖుడయిపోతాడు.

ఈ వాస్తవం ముస్లిమ్ సముదాయంలోని ప్రతి వ్యక్తి మనసులో సదా జాగృతమయి ఉండాలి, తాను న్యాయానికి సంతులనానికీ పిలుపునిచ్చేవాడని, ప్రకటన కర్త అని మరువకూడదు. అతను అక్రమ మార్గాన్ని, దుర్మార్గాన్ని అవలంబించినట్లయితే అది ప్రస్ఫుటంగా ఇస్లామీయ బోధనలకు వ్యతిరేకంగా ఆచరించిన వాడవుతాడని అతను గ్రహించాలి. అది దైవాగ్రహానికి పిలుపునిస్తుందన్న విషయమూ గ్రహించాలి. ముస్లిమ్ వ్యక్తి ఎక్కడున్నా, ఏ సమాజంలో ఉన్నా అతను అన్యాయం, అక్రమాలకు అతీతంగా పరిశుద్ధంగా ఉండాలి. అతను ఏ ఒక్కరిపైనా చెయ్యిచేసుకోరాదు, ఏ దుర్వర్తనునికీ తోడవ్వరాదు, అన్యాయానికి అక్రమానికి ఎదురుగా గట్టిగా నిలబడాలి.

## మానవహక్కుల ఆదరణ

మానవునికి కొన్ని ప్రాథమిక హక్కులు ప్రాప్తమయి ఉన్నాయి. వాటిలో అతను జీవించి ఉండే, ఆర్థిక కృషి సలిపే, తన సొమ్ము, ఆస్తి కలిగి ఉండే, వాటిని ఖర్చుపెట్టు కునే, గౌరవ మర్యాదలతో, మానరక్షణతో జీవించే హక్కులు అన్నింటికన్నా ప్రముఖ మయినవి. ఈ హక్కులు లేనిదే మానవ ఉనికే తీవ్ర ప్రమాదంలో పడిపోతుంది. బ్రతికి ఉన్నా అది జంతుజాల స్థాయిలోని బ్రతుకే కాగలదు. ఆ స్థానంలో మనగలగ డానికే అతను వివశుడయిపోతాడు. ఇస్లామ్ ఈ హక్కులన్నింటి గౌరవాదరణలను బోధిస్తుంది. సమాజంలో వాటిని కాపాడి పెరగనిచ్చే వాతావరణాన్ని సృజిస్తుంది. అది ఇస్లామ్ అనుయాయి ఒక్కొక్కడు ఈ హక్కుల పరిరక్షకునిలా దానికి కాపలా దారునిలా గుర్తింపబడాలని అది కోరుతుంది. దాని ప్రకారం విశ్వాసి ప్రత్యేకత ఏమిటంటే అతని చేత అన్యాయంగా ఏ ఒక్కరి రక్తం చిందరాదు, విశ్వాసి చేతికి ఏ ఒక్కరి రక్తం అక్రమంగా అంటరాదు. అలాగే జనుల మానమర్యాదలు సయితం అతని చేత భద్రంగా ఉండాలి:

...... وَالَّذِيْنَ لَايَدْعُوْنَ مَعَ اللّٰهِ اِلٰهًا اٰخَرَ وَلَايَقْتُلُوْنَ النَّفْسَ الَّتِىْ
حَرَّمَ اللّٰهُ اِلَّا بِالْحَقِّ وَلَايَزْنُوْنَ ۚ وَ مَنْ يَّفْعَلْ ذٰلِكَ يَلْقَ اَثَامًا ۝

(الفرقان:٦٨)

"వారు అల్లాహ్‌ను తప్ప మరే ఇతర ఆరాధ్యునికీ మొరపెట్టుకోరు, అల్లాహ్ నిషేధించిన ఏ ప్రాణినీ అధర్మంగా హతమార్చరు, వ్యభిచారానికీ పాల్పడరు - దీనికి ఒడిగట్టినవాడు తన పాపానికి ప్రతిఫలం పొందితీరుతాడు."

(అల్ ఫుర్‌కాన్ : 68)

వారు అక్రమంగా అధర్మంగా సంపదను ప్రోగుచేసుకోరు. బీదవానికీ, దిక్కులేని వానినీ దోచుకోరు, పైగా తాము ధర్మంగా సంపాదించిన సంపదలో, అడిగేవానికి, నిరుపేదకు, బ్రతుకుతెరువు లేనివారికీ, వంచితులయినవారికీ వాటా విధితమయి, నిర్ణయమయి ఉందని తలపోస్తారు.

وَالَّذِيْنَ فِىْٓ اَمْوَالِهِمْ حَقٌّ مَّعْلُوْمٌ ۝ لِّلسَّائِلِ وَالْمَحْرُوْمِ ۝

(المعارج:٢٤،٢٥)

**'వారి సంపదలో అభాగ్యుల వాటా నిర్ణీతమయి ఉంటుంది... '**

**(అల్ మఆరిజ్ : 24, 25)**

మనిషికి తన భార్యాపిల్లలు, తల్లిదండ్రులు, కుటుంబసభ్యులంటే ఎంతో మక్కువ, భావనాపరమయిన సంబంధముంటుంది. కొన్ని సందర్భాలలోనయితే అతను తన వ్యక్తిత్వంకన్నా వారినే ప్రేమిస్తాడు. వారికి హక్కు ఉంటుంది, అతని నైతిక బాధ్యతా ఉంటుంది, చట్టపరమయిన ఉత్తరదాయత్వము ఉంటుంది - వారి సాఫల్యం, సంక్షేమాలను పరిరక్షించాలి, వారిని అన్ని రకాల కీడుల నుండి కాపాడాలి, అందుకు సకల విధాల ప్రయత్నాలూ చెయ్యాలి. ఇదేవిధంగా సమాజంలో దగ్గరివారూ దూరపువారు తమ హక్కులు కలిగి ఉంటారు. విశ్వాసి అయిన వ్యక్తి తన విశ్వాసంలోని ఆవశ్యకతగా వాటినన్నింటి హక్కుల్ని నెరవేర్చవలసి ఉంటుంది. తన సాధనా సంపత్తిని ఈ విషయాల కొరకు వినియోగించవలసి ఉంటుంది. దివ్య కుర్ఆన్ సదాచార మార్గాన్ని తెలుపుతూ అందులో ఓ ప్రత్యేక కోణం ఇలా ఎత్తిచూపింది :

وَ اٰتَی الۡمَالَ عَلٰی حُبِّہٖ ذَوِی الۡقُرۡبٰی وَالۡیَتٰمٰی وَالۡمَسٰکِیۡنَ وَ
ابۡنَ السَّبِیۡلِ ۙ وَالسَّآئِلِیۡنَ وَ فِی الرِّقَابِ ۚ وَاَقَامَ الصَّلٰوۃَ وَ اٰتَی
الزَّکٰوۃَ ...(البقرة:۱۷۷)

**"తనకు ఇష్టమయిన సంపదను దైవప్రేమలో, బంధువుల కొరకు, అనాథల కొరకు, నిరుపేదల కొరకు, బాటసారుల కొరకు, అర్థించేవారి కొరకు, బానిసల విడుదల కొరకు ఖర్చుచెయ్యాలి; నమాజ్‌ను స్థాపించాలి; జకాత్ నివ్వాలి."**

**(అల్ బకర : 177)**

ఎవరయితే తన బంధుగణమేకాక సమాజంలోని బలహీన వ్యక్తులూ, వర్గాల కొరకు, అనాథలు, నిరుపేదలు, బాటసారులు, అగత్యపరులు, ఇల్లూవాకిలి లేనివారు, చేతిక్రిందివారు - వీరందరి కొరకు వారి హక్కుల కొరకు రక్షణ కల్పిస్తారో, తన జీవన వసతుల్లో వారి హక్కును అంగీకరిస్తారో, ఆ హక్కుల్ని అందజేయడానికి ప్రయత్నిస్తారో, ఇటువంటివారు ఇతరుల హక్కులపైన చెయ్యివేస్తారని, వాటిని కాజేస్తారని ఆలోచించనయినా ఆలోచించగలమా?

ముస్లిమ్ అయిన వ్యక్తి ఈ వైఖరి కేవలం ఒక కుటుంబం, ఒక తెగ, ఒక

జాతి వరకే పరిమితం కాదు. ఇది సమాజంలో అన్ని వర్గాల పట్ల అతను ఇదే వైఖరి నవలంబిస్తాడు. వారు అతని సహమతావలంబీకులయినా లేదా ఇతర మతాల అనుయాయులయినా సరే.

## ఆత్మరక్షణ హక్కు

ప్రపంచంలోని ఏ నాగరిక సమాజమయినా, ఏ సభ్య రాజ్యమయినా, ఏ రాజ్య రాజ్యాంగమయినా కొన్ని విషయాలను సమ్మతిస్తుంది. వాటిలో ఒకటి మనిషి తన ప్రాథమిక హక్కుల్ని పరిరక్షించుకోవడం, వాటిపైన ఎవరూ చెయ్యి చేసుకునేందుకు అనుమతి నివ్వకుండా కాపాడుకోవడం. అతని ధన, మాన ప్రాణాలను, ఎవరయినా చెయ్యెత్తినట్లయితే వారిని ఎదుర్కోవడం. తన భార్యాపిల్లలు కుటుంబంవారిపైన ఎవరయినా అన్యాయం అక్రమం జరపకుండా అనుక్షణం కాపాడుకోవడం. వారి ధన మాన ప్రాణాలను సకల విధాలా రక్షించుకోవడం. కొన్ని సందర్భాలలోనయితే మనిషి తన ఇంటివారిని రక్షించుకోవడం విధిగా నిశ్చయమవుతుంది.

ఇదేవిధంగా ఒక నాగరిక సమాజంలోని ప్రతి వ్యక్తి బాధితుని రక్షించడం, దౌర్జన్యపరునికి తగిన రీతిలో బదులివ్వడం, ఏ ఇంటనయినా దొంగలు బందిపోటులు చొరబడినట్లయితే, అతనిపైన దాడి జరిపినట్లయితే, అతని ధన సామగ్రి కొల్లగొట్ట సాగితే అటువంటి సందర్భంలోనూ అతనికీ తన్ను తాను కాపాడుకునే హక్కు ఉంటుంది, చుట్టుపట్ల నుండే వారికీ అతనికి సహాయపడే బాధ్యత తారసపడుతుంది, అతన్ని అన్యాయం, అక్రమాల నుండీ కాపాడాలి. ఈ సందర్భంలో దాడి జరిపినవాడు సంహరింపబడినా, రక్షించుకునేవాడిపైన ఎలాంటి బాధ్యతా ఉండదు. కారణం, దాడి జరిపినవాడు నేరస్థుడు, కాపాడుకునేవాడిది ఏ విధంగానూ నేరం కాదు. అతను నేరస్థునికి ఆ నేరం చెయ్యకుండా ఆపే ప్రయత్నం చేశాడు. అలాకాక రక్షణ చేసుకునేవాడే రక్షణ ప్రయత్నంలో సంహరింపబడితే అతను సానుభూతికి అర్హుడు. అతనికి నైతికంగా, చట్టపరంగా తప్పక సహాయపడాలి.

ఈ విధంగా రక్షణకు ప్రపంచంలోని ప్రతి నాగరిక చట్టం అంగీకరిస్తుంది. ఇస్లామ్ కూడా దీన్ని ఒక ప్రాథమిక హక్కుగా గుర్తించింది. ఇస్లామ్‌లో మానవునికి తన ధన మాన ప్రాణాలను తన కుటుంబాన్ని రక్షించుకునే పూర్తి అధికారాన్ని

ఇస్తుంది. ఒక ముస్లిమ్ వ్యక్తి తన రక్షణ, తన కుటుంబ రక్షణలో తన ప్రాణం కోల్పోయినట్లయితే ఆ వ్యక్తి అమరగతి స్థానాన్ని పొందగలడు, ప్రవక్త మహనీయుల ప్రవచనాలలో అనేకం ఈ విషయం విశదీకరించబడింది. ఇక్కడ ఒక ఉల్లేఖనం మటుకు ముందుంచుతున్నాము. మహనీయ సయీద్ బిన్ జైద్, తాను ప్రవక్త(శ్రీ (స) ఇలా పలికినట్లు విన్నానని అంటున్నారు :

مَنْ قُتِلَ دُوْنَ مَالِهٖ فَهُوَ شَهِيْدٌ وَ مَنْ قُتِلَ دُوْنَ دِيْنِهٖ فَهُوَ شَهِيْدٌ وَ
مَنْ قُتِلَ دُوْنَ دَمِهٖ فَهُوَ شَهِيْدٌ وَ مَنْ قُتِلَ دُوْنَ اَهْلِهٖ فَهُوَ شَهِيْدٌ(1)

'ఏ వ్యక్తి తన ధన రక్షణలో చంపివేయబడతాడో అతను షహీద్ (అమరగతి పొందినవాడు), ఎవరు తన ధర్మ రక్షణార్థం ప్రాణాలు కోల్పోతాడో అతనూ షహీద్, ఎవరు తన ఆత్మరక్షణలో చనిపోతాడో అతనూ షహీద్‌గా పరిగణించబడతాడు. ఎవడు తన ఇంటివారల రక్షణలో చంపబడతాడో అతనూ షహీద్‌గానే లెక్కించబడ తాడు.' (తిర్మిజి : కితాబుద్దియత్)

రక్షణ విషయంలో రెండు విషయాలు గుర్తుంచుకోవలసి ఉంటుంది:

(1) రక్షణ భారం అసలు బాధ్యత ప్రభుత్వానిది. అది దాని పౌరుల ధన మాన ప్రాణాలను కాపాడవలసి ఉంటుంది. ఒక పౌరునికైనా లేదా పౌరుల వర్గానికైనా తమ రక్షణ అవసరం కలిగేది అకస్మాత్తుగా దాడి జరిగినప్పుడే, ప్రభుత్వం తన బాధ్యత నిర్వర్తించే అవకాశం దొరకక అది తన బాధ్యత నెరవేర్చకపోయినప్పుడే. అందువల్ల మనిషి ధన మాన ప్రాణాలకు లేదా ప్రాథమిక హక్కులకు ప్రమాదాలు ఏర్పడినట్లు గమనించినప్పుడు వీలుంటే తొలుత ప్రభుత్వానికి దాని బాధ్యతను గుర్తుచేయాలి. దాని సహాయం పొందే ప్రయత్నం చేయాలి. కాని దాని అవకాశం లేకపోయినట్లయితే, ప్రభుత్వం ప్రమత్తంగా ఉండి దాని పక్షాన అజ్ఞాగ్రత్త కనబరిస్తే మనిషి తన రక్షణకు ఉద్యుక్తుడయ్యే పూర్తి హక్కు కలిగి ఉంటాడు.

(2) స్వీయరక్షణలో మరో విషయాన్నీ గుర్తుంచుకోవాలి. శక్తి అతి తక్కువగా వినియోగించాలి. దాడి జరిపినవాడు కేవలం భయపెట్టడానికి, బెదిరించడానికి, గలభా చెయ్యడానికి మాత్రమే పరిమితమయి పారిపోయినట్లయితే అతన్ని గాయపరచడానికి లేదా హతమార్చడానికి ప్రయత్నం జరగదు. అతని ప్రాణం తీయడమంటే అదొకటే తప్ప మరో గత్యంతరం కానలేని పరిస్థితుల్లో మాత్రమే దాన్ని అవలంబించాలి.

ఆత్మ రక్షణ హక్కు అంగీకృతమయిన హక్కు. దీనిద్వారా సమాజంలో అత్యంత బలహీన వ్యక్తికి కూడా కొంత సాహసం కలుగుతుంది, కాస్త ధైర్యం ఏర్పడుతుంది. తన ధన మాన ప్రాణాలు, భార్యాబిడ్డలు దుర్మార్గులు, దౌర్జన్యపరుల దయాదాక్షిణ్యాల పైన ఆధారపడి జీవించవలసిన అవసరం లేదని. అవసరం కలిగినప్పుడు, ప్రభుత్వ సహాయం, లేదా మరే వ్యక్తి సహాయమో ప్రాప్తం కాకపోయినా తాను స్వయంగానూ తన బలం, స్థోమతననుసరించి తన ఆస్తిపాస్తుల్నీ, తన కుటుంబం వారిని కాపాడుకో గలడన్న భరోసా ఉంటుంది. ఒక ముస్లిమ్ వ్యక్తి వివశుడయి ఇటువంటి సున్నిత పరిస్థితుల్లో తన ఈ హక్కును వినియోగించుకుంటే అతను ఇస్లామీ బోధనల్నీ వినియోగించిన వాడవుతాడు, అలా ఆ కాలం, దేశం పరిస్థితుల ననుసరించి సమ కాలీన చట్టాన్ని జవదాటని వాడవుతాడు. (చూడండి, 'ఇస్లామ్ – మానవ హక్కుల రక్షణ' – తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్, హైదరాబాద్)

## ప్రతీకారం హక్కు

ఇస్లామ్ ఎటువంటి అన్యాయం అక్రమాలను ఎట్టి పరిస్థితిలోనూ సమ్మతిం చదు. అది దీన్ని అన్ని విధాలా నిరోధించాలని అభిలషిస్తుంది. అందులో ఒక కోణం ఏమిటంటే, ఒకరిపైన అన్యాయం జరిగితే లేదా అతనికి ఏదయినా నష్టం కలిగితే అతనికి ఆ అపరాధి పట్ల ప్రతీకారం తీర్చుకునే హక్కునిస్తుంది. దివ్య కుర్ఆన్ అతి సున్నితమయిన కఠిన పరిస్థితుల్లో మానవునికి ఈ హక్కును ప్రకటించింది.

అష్షూరా సూరా మక్కాలో అవతరించింది. అక్కడ ముస్లిములకు విభిన్న విధాల అన్యాయాలు, అక్రమాలు ఎదురవుతున్నాయి. ఎంతో కఠిన పరిస్థితులు, పరీక్షలు ఎదురవుతున్నాయి. వాతావరణం చాలా కఠోరంగా ఉంది. ఈ సూరాలో ఒకచోట విశ్వాసులను ప్రశంసించడం జరిగింది. వారితో దైవంపైన నమ్మకం, దృఢ విశ్వాసం, ఆయనపైన పరిపూర్ణ భరోసా ఉంటుందని, వారు బృహత్తర పాపాలకు దూరంగా మెలుగుతారని, ఎవరయినా తప్పుడుగా ప్రవర్తిస్తే వారిలో ఆగ్రహం కలగదని, వారు క్షమాశీలురయి మన్నింపు వైఖరినవలంబిస్తారని చెప్పడం జరిగింది. ఇంకా వారు అల్లాహ్ పిలుపునకు లబ్బైక్ (హాజరయ్యాము) అని సమాధానమిస్తారని, నమాజ్‌ని స్థాపిస్తారని, తమ వ్యవహారాలను పరస్పరం సలహా సంప్రతింపుల ద్వారా

నిర్వర్తిస్తారని, దైవమార్గంలో ధనం వెచ్చిస్తారని చెప్పడం జరిగింది. ఈ సద్గుణాలను తెలిపిన తరువాత ఇలా ప్రస్తావించడం జరిగింది :

وَالَّذِينَ إِذَا أَصَابَهُمُ الْبَغْيُ هُمْ يَنْتَصِرُونَ ۝ (الشورى:٣٩)

'వారిపైన ఏదయినా అక్రమం జరిగినప్పుడు వారు ప్రతీకారం తీర్చుకుంటారు.'

(అష్ షూరా : 39)

దీనిద్వారా కొన్ని విషయాలు ముందుకు వస్తున్నాయి :

అల్లాహ్ దాసుల సజ్జనులయినవారు బలహీనులు, చేతకానివారు, పిరికివారు, ధైర్యంలేనివారుగా ఉంటారన్న అభిప్రాయం తప్పయినది, ఈ ఆయత్ ఈ తప్పుడు అభిప్రాయాన్ని ఖండిస్తుంది. సదాచారులయిన వారిని ఎవరయినాసరే దౌర్జన్యానికి గురిగా చేసుకోగలరన్నది సరయినది కాదని, ఈ ఆయత్ నిరూపిస్తుంది. అంతేకాదు, దైవభక్తిపరాయణులయినవారు దైవ నిష్ఠగలవారు, అన్యాయం సమక్షంలో మోకరిల్లరని, అన్యాయవర్తనులను వారు ఎదుర్కొంటారని, వారు ఎవరయినా సరే సునాయాసంగా మింగేయడానికి మెత్తని మెతుకు కారని, ఎవరయినా వారిపైన అత్యాచారం జరిపితే వారు దానికి బదులిస్తారని, ఇలా చెయ్యడం వారి దైవభక్తి, ధర్మనిష్ఠకు భంగం కలుగజెయ్యదని ఇది రూఢీ పరుస్తుంది. సజ్జనులయిన వారు కేవలం వివశులయినవారని, ఎటువంటి అన్యాయానికీ బదులివ్వడం వారికి సాధ్యమయ్యే విషయం కాదని సమాజంలో ప్రచారమయిపోతే ప్రతికూల వాతావరణంలో వారు బ్రతికి బట్టకట్టడం దుస్సాధ్యమయిపోతుంది. దాని ప్రభావం సమాజంపైన అతి దారుణంగా పడుతుంది. వివశత, బలహీనతల్ని జనం సదాచారానికి భయభక్తులకు తప్పనిసరి ప్రత్యేకతలుగా భావించడం మొదలెడతారు.

ప్రతీకారం అంటే దౌర్జన్యానికి బదులు తీర్చుకోవడం అన్నమాట. అదెప్పుడు తలెత్తుతుంది? ఒకరిపైన అన్యాయం జరిగినప్పుడు మాత్రమే. ఎవరయినా అమాయకుడు, నిరపరాధి పైన చెయ్యి చేసుకోవడం ప్రతీకారం కాదు, అది స్పష్టంగా అన్యాయం. విశ్వాసులు ఇటువంటి అన్యాయానికి దూరంగా ఉండాలి. కాని ఒకవేళ వారిపైన ఎవరయినా దౌర్జన్యం జరిపినట్లయితే వారికి బదులుగా ప్రతీకారం తీర్చుకునే హక్కు ఉంటుంది. ఈ హక్కును వినియోగించుకోవడాన్ని ఏ విధంగానూ అధర్మమని ఎవరూ అనలేరు. కొన్ని సందర్భాలలో అది అభిలషణీయం కూడా.

## ప్రతీకారంలో పరిమితుల పాటింపు

ఇస్లామ్ ప్రతీకారం హక్కును సమ్మతించిన తరువాత, ఏ మేరకు దౌర్జన్యం జరిగిందో ఆ మేరకే ప్రతీకారం కూడా తీర్చుకోవాలని తాకీదు చేసింది. పరిమితుల్ని అతిక్రమించడం స్వయంగానే జులుం, అదీ పట్టుబడవలసిన నేరం.

దివ్య కుర్ఆన్ దీనికి కిసాస్ చట్టం నియమించింది. ఈ చట్టానికి ఆధారం, ప్రతీకారంలో సమానత్వ భావనే. ఈ చట్టం రీత్యా ఒక్క వ్యక్తికి బదులుగా పదిమంది ప్రాణాలు తీయడం అక్రమం. స్త్రీ హత్య జరిగితే దానికి బదులుగా నిర్దోషి అయిన పురుషుని చంపడం కూడా దోషమే. హత్య చేసిన వ్యక్తి బానిస అయినట్లయితే అతనికి బదులుగా స్వేచ్ఛాయుత వ్యక్తిని చంపడం కూడా అన్యాయమే. (అల్ బకర : 178)

కిసాస్ చట్టంలోని కొన్ని అధికరణలు తౌరాత్ ప్రకారం కూడా వివరించ బడ్డాయి. (అల్ మాఇద : 45) వీటిలో అతి స్పష్టంగా చెప్పిన విషయం, ఒక వ్యక్తి చేసిన అపరాధానికి మరోవ్యక్తిని పట్టుకోవడం జరగదు. చట్టం దృష్టిలో అందరూ సమానులే. చట్టంలో నిమ్నోన్నతా భేదభావాలుండవు. అలాగే ఏ వ్యక్తి అయినా చిన్నదయినా పెద్దదయినా పట్టుకోదగిన నేరం చేసినట్లయితే అతను చేసిన అపరాధానికి మించిన శిక్ష అతనికి విధించడం జరగదు.

ప్రతీకారం హక్కు విషయంలో ఇస్లామ్ కొన్ని పరిమితులు, మర్యాదలు నియమించింది. ఎట్టి పరిస్థితిలోనూ వాటిని పాటించడం అవసరమని తాకీదు చేయబడింది. వీటి వివరాలు కుర్ఆన్ హదీసులు, షరీఅత్‌వేత్తల వద్ద ప్రాప్తమవు తాయి. అయితే కొన్ని అత్యవసర అంశాలు మటుకు ఇక్కడ ప్రస్తావించబడుతున్నాయి:

1. అత్యాచారం జరిగితే వెనువెంటనే బదులిచ్చే హక్కుంది. అయితే బదులు తీర్చుకునే హక్కు అత్యాచారం జరిగిన మేరకే ప్రాప్తమయి ఉంటుంది. ఒక వ్యక్తి చెంపదెబ్బ కొడితే బదులుగా అతని చెయ్యి నరికివెయ్యడం సరయినది కాదు. లేదా నోరు జారినట్లయితే అతని పల్లు ఊడబెరకడమూ సరయినది కాదు. ఇలా చెయ్యడం ప్రస్ఫుటంగా అన్యాయం, అక్రమం. ఇలా చేసేందుకు ఎంతమాత్రం అలివి లేదు. దివ్య కుర్ఆన్ అతి స్పష్టంగా నిర్దేశిస్తుంది:

فَمَنِ اعْتَدٰی عَلَیْکُمْ فَاعْتَدُوْا عَلَیْهِ بِمِثْلِ مَا اعْتَدٰی عَلَیْکُمْ
وَاتَّقُوا اللّٰهَ وَاعْلَمُوْٓا اَنَّ اللّٰهَ مَعَ الْمُتَّقِیْنَ○ (البقرہ:۱۹۴)

**"మీపై ఎవరయినా చెయ్యి చేసుకుంటే, దానికి సరిసమానంగానే మీరున్నూ వారిపై చెయ్యేత్తండి. అయితే దైవానికి సదా భయపడుతూ ఉండండి, ఒకటి బాగా తెలుసుకోండి, అల్లాహ్ తన నియమాలను ఉల్లంఘించకుండా కాపాడుకునే వారికే తోడుగా ఉంటాడు."**

***(అల్ బకర : 194)***

2. ప్రతీకారంలో షరీఅత్, నైతికతల హద్దులు పాటించడం తప్పనిసరి. ఉదాహరణకు ఒక వ్యక్తి, మరో వ్యక్తిని కాళ్ళు, చేతులు, ముక్కు చెవులు కోసి సంహరించినట్లయితే లేదా మృత శరీరానికి చిత్రహింస పెట్టినట్లయితే, దాన్ని ముక్క ముక్కలుగా నరికినట్లయితే, ప్రతీకారం పేరిట హంతకుని ఎడల ఇదే వైఖరి నవలంబించడం తగదు. హంతకునికి చట్టం రీత్యా కేవలం హత్యాదండనే విధించబడుతుంది. అలాగే ఎవరయినా ఒక స్త్రీతో వ్యభిచారం చేసినట్లయితే దానికి ప్రతీకారంగా అతని భార్య లేదా కూతురు ఎడల ఇదే వైఖరి నవలంబించడం సరయినది కాదు. అతనికి చట్టం రీత్యా వ్యభిచార నేరానికి శిక్ష విధించవలసి ఉంటుంది.
3. నోటి మాటల అక్రమానికి కూడా బదులు తీర్చుకోవచ్చు. అందులోనూ నైతిక పరిమితులను పాటించవలసి ఉంటుంది. ఆ హద్దులను దాటడం ధర్మసమ్మతం కాదు. ఒకరు తూలనాడినట్లయితే దానికి బదులుగా తూలనాడటం, అపనిందలు వెయ్యడం, అబద్ధాలు ఆపాదించడం, లేదా మొత్తం కుటుంబంపైన తూలనాడుల వర్షం కురిపించడం ఎంతమాత్రం సరయినది కాదు.
4. అన్యాయం, అక్రమం జరిగితే దానికి ఎదురుగా నిరసన తెలుపడం, ఎలుగెత్తి చాటడం ధర్మసమ్మతమే. అప్పుడే దుర్మార్గుడు దుర్మార్గుడని, బట్టబయలవుతుంది, బాధితునికి సమాజంలో సహాయం అందుతుంది. కుర్ఆన్ అంటోంది :

لَایُحِبُّ اللّٰهُ الْجَهْرَ بِالسُّوْٓءِ مِنَ الْقَوْلِ اِلَّا مَنْ ظُلِمَ ؕ وَکَانَ اللّٰهُ
سَمِیْعًا عَلِیْمًا○ (النساء:۱۴۸)

**"మనిషి దుర్భాషలాడటానికి నోరు తెరవడం అల్లాహ్‌కు సుతరామూ ఇష్టం**

లేదు–ఎవరిపైనయినా దౌర్జన్యం జరిగితే తప్ప. మరి అల్లాహ్ సర్వం వినేవాడు, సమస్తం తెలిసినవాడు." *(అన్ నిసా : 148)*

5. ప్రతీకారానికి ప్రభుత్వ చట్టం సహాయం పొందాలి. ప్రతీకారానికి సంబంధించి అనేక విధాల చట్టం సహాయంతోనే అమలుపరచ వీలవుతుంది. దాన్ని కాదని చట్టాన్ని చేతుల్లో తీసుకునే విధానం సరయినది కాదు.

అలాగే ఇంకా అనేక నిబంధనలు ప్రతీకారానికి సంబంధించినవీ ఉన్నాయి. వాటినన్నింటినీ పరిగణనలోకి తీసుకోవలసి ఉంటుంది.

## ప్రతీకార హక్కు దేనికి?

ప్రతీకారం వల్ల జరిగిన నష్టం కొంతమేర చెల్లుబాటు అవుతుంది. బాధితుని ఆత్మ గౌరవం మిగిలి ఉంటుంది. అతనికి తాను వివశుణ్ణి, బాధితుణ్ణి అన్న అనుభూతి ఉండదు. ఇంకా అంతకు మించి మరో విషయం ఏమిటంటే, అన్యాయం, దౌర్జన్యం, ఉగ్రవాద ధోరణిని అంతమొందించడంలో సహాయం లభిస్తుంది. మనిషికి ఈ హక్కే లేకపోయినట్లయితే అన్ని వైపులా జులుం, అత్యాచారాలు రాజ్యమేలడం మొదలవుతుంది. ఒక బలహీనుడి ధన, మాన, ప్రాణాలు సురక్షితంగా మనజాలవు. ప్రతీకారాన్ని నైతికతకు భిన్నమయిందని కూడా అనలేము. ప్రతీకారానికి బదులు క్షమా మన్నింపుల విధానం అవలంబించడం ఎంతో గొప్ప నైతిక గుణం. దాని వివరణ ముమ్ముందు రాబోతోంది. కాని హక్కుల పరిరక్షణ కూడా ప్రముఖమయినదే. ప్రతీకారం దీని నిమిత్తమే అవసరమవుతుంది. దివ్య కుర్ఆన్ క్షమాగుణం, మన్నింపు, ప్రతీకారాలలో ప్రతి దాన్నీ సందర్భోచితంగా సరయిన స్థానాన్నిచ్చింది. ఇందులో ఒక విధమయిన సంతులనం ఇనుమడింపజేసింది. ఒక వైపున విశ్వాసుల సుగుణాల ప్రస్తావనలో, వారిపైన అత్యాచారం జరిగితే ప్రతీకారం తీర్చుకుంటారని చెప్పడం జరిగింది, మరోవైపున వారి క్షమాగుణం, చూపోపు విధానం గురించి ప్రశంసించడమూ జరిగింది. ఇందులో ఎటువంటి వైరుధ్యం లేదు. దీన్ని రెండు వైఖరుల్ని ప్రశంసించడం అని అనరు. ఎందుకంటే రెంటి సందర్భం పూర్వాపరాలు వేర్వేరయినవి. సమాజంలో ఒక ముస్లిమ్ వ్యక్తి బలహీనుడు, వివశుడూ అయి జీవించడం, ఎవరయినా సరే అతనిపైన చెయ్యి చేసుకోగలగటం ఏమంత పొగడదగ్గ విషయం కాదని పండితులు అంటారు. అతను బలాఢ్యుడయి ఉండాలి. కోరితే ప్రతీకారమూ

తీర్చుకోగలగాలి లేదా మన్నించదలచినా మన్నించివెయ్యాలి. మన్నింపు వైఖరి వల్ల దుర్మార్గుని సాహసం పెరుగుతుందని, నిరపరాధులు అతని దౌర్జన్యాలకు గురవుతారని అనిపించిన సందర్భాలన్నింటిలో ప్రతీకారం తీర్చుకోవడమే ఉత్తమం. అప్పుడే దుర్మార్గుడి ధైర్యం సడలి అతను మరెవరిపైన చెయ్యి చేసుకోనేరడు. కాని ఒకవేళ దుర్మార్గుడికి తన చర్య పట్ల పశ్చాత్తాపం, పునరాలోచన తన తప్పును అతను గ్రహించి నట్లు అనిపిస్తే క్షమించివెయ్యడం వల్ల అతనిపైన ఉత్తమ ప్రభావం పడుతుందని గ్రహిస్తే మన్నించివెయ్యడమే ఉత్తమం. అసలు విషయం దౌర్జన్యం అంతం కావాలి. అదే దృష్టిలో ఉంచుకుని క్షమించి వెయ్యడమో ప్రతీకారమో ఏదో వ్యవహారం ఎన్నుకోవాలి.

అల్లామా ఇబ్ను అరబీ మాలికీ ప్రకారం అష్షూరా సూరాలో 'ఇన్తిసార్' లేదా ప్రతీకారం అన్నది అభిలషణీయ చర్యలా పేర్కొనబడిందని అంటారు. ఇతర సందర్భాలలో క్షమా, మన్నింపుల వైఖరిని ప్రశంసించడం జరిగింది. ఈ విధంగా భిన్న రీతుల్లో ప్రశంసించడానికి రెండు కారణాలు కావచ్చు. ఒకటి, ఈ నిర్దేశాలలో ఒకటి మరొకదాన్ని రద్దు చేసి ఉండాలి. రెండవ కారణం, ఇవి రెండూ రెండు భిన్న సందర్భాలకు సంబంధించినవిగా పరిగణించాలి. ఇదే సరయినదని మా భావన. ఒక సందర్భం ఏమిటంటే, దుర్మార్గుడు విచ్చలవిడిగా తప్పుడు పని చేస్తూ ఉన్నట్లయితే, సామాన్య జనులతో దూషణలతో మాటలాడుతూ ఉంటే, అశ్లీలంగా వ్యవహరిస్తూ ఉంటే, పిన్నలకూ, పెద్దలకూ బాధ కలిగిస్తూ ఉంటే, ఇటువంటి వ్యక్తి పట్ల ప్రతీకారం తీర్చుకోవడం ఉత్తమం. ఇటువంటి పరిస్థితిని గురించి ఇమామ్ నఖయీ ప్రకారం పూర్వీకులు దీన్ని ఇష్టపడేవారు కారు. అంటే మనిషి చాలా హీనస్థితికి దిగజారి, బలహీనుడయి పాపాతురులు, దుర్మార్గులు సాహసోపేతులయి మెలగటం అసహనీయమని అనేవారన్నమాట.

రెండవ సందర్భం ఏమిటంటే, పొరపాటుగా ఎవరిచేతనయినా తప్పుడు పని జరిగి అతను తన తప్పును ఒప్పుకుని క్షమాభిక్షను అర్థిస్తే అతన్ని మన్నించి వెయ్యడం అభిలషణీయం అన్నమాట. అల్లామా కర్తబీ ఈ కారణాలు చెప్పడాన్ని పొగిడారు. ఆయన ప్రకారం తబరీ కూడా ఈ కారణాన్నే చెప్పారు.(కర్తబీ : అహ్కామ ఉల్ అహ్కామ్ : సం.8, భాగం 16; పు.27)

ఇమామ్ రాజీ ప్రకారం క్షమాభిక్ష కారణంగా కల్లోలం అణగుతున్నట్లయితే, తప్పు చేసిన వ్యక్తి తన వైఖరిని మానుకుంటున్నట్లయితే క్షమ అభిలషణీయం. కాని క్షమ వల్ల అపరాధి సాహసం పెరిగినట్లయితే; అతనిలో ఆగ్రహావేశాలు పెచ్చరిల్లి నట్లయితే ప్రతీకారం తీర్చుకోవడమే సరి. (రాజీ: అత్తఫ్సీర్ కబీర్ : సం.14, భాగం 27; పు.152)

ఈ విషయాలు బాహ్యంలో చూస్తే ఇస్లామీయ సమాజాన్ని దృష్టిలో ఉంచుకుని వ్రాసినట్లు అగుపిస్తాయి, కాని ఇస్లామేతర సమాజంలో ఒక ముస్లిమ్ వ్యక్తి వైఖరి క్షమ, మన్నింపుల వైఖరే సరయినది. అయితే చట్టం పరిధిలో ఉంటూ ప్రతీకారపు హక్కును వినియోగించుకుని బాధను నివేదించుకునేందుకు ప్రయత్నించని ఎవరయినా వివశుడయ్యే పరిస్థితులు కూడా ఎదురవవచ్చు. (ఈ విషయాన్ని తెలుసుకునేందుకు, రచయిత పుస్తకం, 'బలహీనుడు, పీడితుడు - ఇస్లామ్ ఛాయలో' అనే దాన్ని చూడగలరు)



రెండవ అధ్యాయం

# 2. ముస్లిమ్, ముస్లిమేతరుల సంబంధాలు

ఈ రోజుల్లో ప్రపంచంలోని అత్యధిక దేశాల్లో మిశ్రమ ప్రజలున్నారు. వారిలో భిన్న జాతులవారు, విభిన్న సంస్కృతుల వారు, భిన్న భాషల వారూ ఉన్నారు. వీటిలో కొన్ని దేశాల్లో అత్యధిక సంఖ్యాకులున్నారు. కొన్నింటిలో అల్పసంఖ్యాకులున్నారు. ఉభయ దేశాల సమస్యలు వాటికవే ప్రత్యేకం. ఆయా దేశాలు వాటిని పరిష్కరించడానికీ ప్రయత్నిస్తుంటాయి. ప్రజాస్వామిక దేశాల్లో అల్ప సంఖ్యాకులయినా అధిక సంఖ్యాకులయినా ఉభయుల హక్కులు సమానంగా అంగీకరించబడ్డాయి. అయినప్పటికీ సర్వ సాధారణంగా అల్ప సంఖ్యాకులు అధిక సంఖ్యాకుల ఒత్తిడిని అనుభవిస్తూ ఉంటారు. వారి హక్కుల్ని పూర్తిగా కాపాడటం జరగదు. వారి ఓ పెద్ద సమస్య ఉభయుల మధ్య పరస్పర సంబంధాల విషయంలోనూ తలెత్తుతూ ఉంటుంది.

ఏ దేశాల్లోనయితే ముస్లిములు అల్పసంఖ్యలో ఉంటారో అక్కడ ఓ ప్రశ్న మాటిమాటికి తలెత్తుతూ ఉంటుంది. వారి సంబంధాలు అధిక సంఖ్యాకులతో ఏవిధంగా ఉండాలి అన్నది ఆ సమస్య. ముస్లిములు ఇతరులతో వేరుగా దూరంగా, ఎడంగా జీవించాలా లేదా దగ్గరి సంబంధాలు పెట్టుకోవాలా? దగ్గరి సంబంధాలున్నా అవి ఓ ప్రత్యేక పరిధిలో పరిమితస్థాయిలో మటుకే ఉండాలా లేక అవి విస్తృత పరిధిలో ఉండాలా? వారిని వీరు తమ ప్రత్యర్థులుగా, విరోధులుగా ఎంచి వ్యవహరించాలా లేదా వారితో ప్రేమగా, సానుభూతి, అనురాగమయంగా సదాచార సంపన్నంగా మసలుకోవాలా? నేడు వారికి ఇది ఓ సున్నితమయిన విషయంగా రూపొందింది. దీనిపట్ల కొన్ని ప్రత్యేక కోణాలలో పరిశీలన జరపవలసి వుంటుంది. దీనిద్వారా ఇస్లామ్ దృక్కోణం క్షుణ్ణంగా బోధపడుతుంది.

1. సమాజంలో ఒక వ్యక్తికి మరో వ్యక్తిపైన, ఒక వర్గానికి మరో వర్గానికి న్యాయబద్ధమయిన, సహజమయిన హక్కులుంటాయి. ఈ హక్కులే పరస్పర సంబంధాల తీరును నిర్ణయిస్తాయి. వీటిని నిర్వర్తించడం లేదా నిర్వర్తించక

పోవడంపైనే సంబంధాలలో మెరుగుదలో, చెడుగో జనిస్తాయి. ఏ రాజ్యంలోనయితే ముస్లిమేతరులు అధికంగా ఉంటారో అక్కడ ప్రతి వ్యక్తి, ప్రతి వర్గం హక్కులు సదా సురక్షితంగానే ఉండటం అవసరమేమీ కాదు. ఈ హక్కులు కాలరాయబడటమూ కద్దు. ఒకవేళ ఈ హక్కులు అణగదొక్కబడుతున్నట్లయితే ముస్లిమ్ అల్పసంఖ్యాకుల వైఖరి ఏమయి ఉండాలి? వారు పీడితుల సమర్థనలో నిలబడతారా లేదా తటస్థంగా ఉంటారా?

2. ఒక వాస్తవం ఏమిటంటే, ఈ వాస్తవాన్ని కాదనజాలము కూడా, ఇస్లామ్ ఎంతో ఉన్నత నైతికతను బోధించింది. దాని అనుయాయులు దానికి కట్టుబడి ఉండవలసే ఉంటుంది. ఈ నైతిక బోధనలు కేవలం ముస్లిముల విషయంలోనేనా లేదా ముస్లిమేతరుల సంబంధంలోనూ వారు వాటికి కట్టుబడి ఉండవలసి ఉంటుందా? ముస్లిములు, తాము ముస్లిముల ఎడల అవలంబించే నైతిక వైఖరినే ముస్లిమేరుల విషయంలోనూ అవలంబించడానికి కట్టుబడి ఉన్నారా?

3. ముస్లిములు ఒక సముదాయం. వారి జీవిత లక్ష్యం, ముఖ్యమయిన లక్ష్యం, 'దైవం వైపునకు పిలుపు'. ఒక ముస్లిమేతర సమాజంలో ముస్లిముల ఈ బాధ్యతలు మరీ పెరిగిపోతాయి. ఈ బాధ్యతల్ని నిర్వర్తించడానికి దివ్యకుర్ఆన్ ఏ నిర్దేశాలనిచ్చిందో చూడవలసింది వుంటుంది. ఆ సందర్భంలో సంబోధిత జాతితో ఎటువంటి సంబంధాలను పెట్టుకోవాలని ఆదేశాలనిచ్చిందో చూడవలసి ఉంటుంది.

## బాధితుని హక్కుల సమర్థన

ప్రప్రథమంగా మానవ హక్కుల సమస్యను తీసుకుందాం. న్యాయబద్ధమయిన విషయం ఏమిటంటే సమాజంలో ఒక వ్యక్తి లేదా ఒక వర్గానికి న్యాయబద్ధంగా లభించి, గుర్తుంపు పొందిన హక్కులే ఇతర వ్యక్తి, ఇతర వర్గాలకు చట్టబద్ధంగా ప్రాప్తంకావాలి, ఆచరణాత్మకంగా వాటిని నిర్వర్తింపజేయాలి. ఇలా జరిగినట్లయితే ఉభయుల మధ్య సుహృద్భావపూర్వకమయిన సంబంధాలు ఏర్పడతాయి. అలా జరగకపోతే తప్పనిసరిగా ఆ సంబంధాలలో వక్రత ఏర్పడుతుంది. అప్పుడే సంఘర్షణ మొదలవుతుంది.

మనిషి సమాజంలోనే జీవిస్తాడు కాబట్టి దాని అనేకమంది వ్యక్తులతో అతని

సంబంధాలు దగ్గరివీ దూరపువీ ఏర్పడతాయి. అలాగే అతనిపైన అందరి హక్కులు ఎక్కువగానో తక్కువగానో ఏర్పడతాయి. ఇస్లామ్ ఈ హక్కులన్నింటినీ గుర్తించింది. గుర్తించడమేకాదు వాటిని నిర్వర్తించడానికి గట్టిగా తాకీదు చేసింది. ఈ హక్కులు ఏవిధంగా ఒక ముస్లిమ్‌పైన మరో ముస్లిమ్ వ్యక్తికి ఉంటాయో అలాగే ముస్లిమేతర వ్యక్తికీ ఉంటాయి. ఇక్కడ కొన్ని సందర్భాలను ఉటంకిస్తున్నాము.

وَ اٰتِ ذَا الْقُرْبٰى حَقَّهٗ وَالْمِسْكِيْنَ وَابْنَ السَّبِيْلِ وَلَا تُبَذِّرْ تَبْذِيْرًا (بنی اسرائیل:۲۶)

"బంధువులు, నిరుపేదలు, బాటసారులకు వారి హక్కులను నిర్వర్తించండి."
(బనీ ఇస్రాయీల్ : **26**)

ఈ హక్కుల్లో కొన్ని చట్టపరమయినవి. అవి అత్యధికంగా నైతికమయినవి. ఈ కారణంగానే దివ్యఖుర్ఆన్‌లో 'ఇహ్సాన్' అనే పదం ప్రయోగించబడింది. దాని భావం, ఉత్తమ రీతిలో, శుభకరంగా, మంచిగా మెలగటం, శ్రేష్ట వైఖరినవలంబించడం, ఉదాత్తంగా వ్యవహరించడం అన్నది :

وَ اعْبُدُوا اللّٰهَ وَلَا تُشْرِكُوْا بِهٖ شَيْـًٔا وَّ بِالْوَالِدَيْنِ اِحْسَانًا وَّ بِذِی الْقُرْبٰى وَالْيَتٰمٰى وَالْمَسٰكِيْنِ وَالْجَارِ ذِی الْقُرْبٰى وَالْجَارِ الْجُنُبِ وَالصَّاحِبِ بِالْجَنْۢبِ وَابْنِ السَّبِيْلِ ۙ وَمَا مَلَكَتْ اَيْمَانُكُمْ ؕ اِنَّ اللّٰهَ لَا يُحِبُّ مَنْ كَانَ مُخْتَالًا فَخُوْرَا ۙ (النساء:۳۶)

'మీరందరూ అల్లాహ్ దాస్యం చెయ్యండి. ఆయనతోపాటు మరెవరినీ సహవర్తులుగా ఎంచకండి. తల్లిదండ్రుల పట్ల సద్వర్తనతో వ్యవహరించండి. బంధుగణం, అనాథలు, నిరుపేదల ఎడల మంచితనంతో మెలగండి. పొరుగులోని చుట్టంతోను, అపరిచితుడయిన పొరుగువానితోను, పక్కన ఉండే సహచరునితోను, ప్రయాణికునితోను, మీ హస్తగతమయి ఉన్న దాసదాసీలతోను ఉపకార బుద్ధి కలిగి ప్రవర్తించండి. నమ్మండి, తన స్వీయోత్కర్ష వల్ల అహంకారి అయిన వ్యక్తినీ, తన పెద్దరికం పట్ల గర్వపడే వానినీ, ఎవరినీ నిశ్చయంగా అల్లాహ్ ఇష్టపడడు. ' *(అన్‌నిసా: **36**)*

బనీ ఇస్రాయీల్ ఏ విషయాల పాటింపును గురించి ప్రమాణం చేయించుకోవడం జరిగిందో అందులో 'ఇహ్సాన్' వైఖరికూడా ఒకటి. (అల్ బకర : 83)

'ఇహ్సాన్' అన్న దానిలోనూ ఉత్తమరీతిలో మెలగటం, ప్రేమానురాగాలు, సానుభూతి, శ్రేయోభిలాష, హితవు కోరడం, వీటితోపాటు ఆర్థిక సహాయం, ధన సహాయం కూడా చేరి ఉన్నాయి. కాగా 'బకర'సూరాలో 'బిర్ర్' అంటే శుభ వైఖరిని గురించి దాని వాస్తవికత ఏమిటో తెలుపడం జరిగింది. ఈ సందర్భంలో ఇలా సెలవీయబడింది.

...وَ اٰتَی الْمَالَ عَلٰی حُبِّهٖ ذَوِی الْقُرْبٰی وَالْیَتٰمٰی وَالْمَسٰكِیْنَ وَابْنَ السَّبِیْلِ ۙ وَالسَّآئِلِیْنَ وَ فِی الرِّقَابِ ۚ وَ اَقَامَ الصَّلٰوةَ وَ اٰتَی الزَّكٰوةَ ۚ......(البقرة:١٧٧)

తనకు ఇష్టమయిన సంపదను దైవప్రేమలో, బంధువుల కొరకు, అనాథల కొరకు, నిరుపేదల కొరకు, బాటసారుల కొరకు, అర్థించేవారి కొరకు, బానిసల విడుదల కొరకు ఖర్చు చెయ్యాలి నమాజ్‌ను స్థాపించాలి జకాత్ నివ్వాలి. *(అల్‌బకర : 177)*

బకర సూరాలో ధర్మమార్గంలో ఖర్చుపెట్టడం గురించి ప్రశ్నకు సమాధానం ఇవ్వబడింది.

یَسْـَٔلُوْنَكَ مَاذَا یُنْفِقُوْنَ ؕ قُلْ مَاۤ اَنْفَقْتُمْ مِّنْ خَیْرٍ فَلِلْوَالِدَیْنِ وَ الْاَقْرَبِیْنَ وَالْیَتٰمٰی وَالْمَسٰكِیْنِ وَابْنِ السَّبِیْلِ ؕ وَمَا تَفْعَلُوْا مِنْ خَیْرٍ فَاِنَّ اللّٰهَ بِهٖ عَلِیْمٌ ○ (البقرة:٢١٥)

జనం ప్రశ్నిస్తున్నారు, "ఏమి ఖర్చుచెయ్యాలి?" అని. వారికి బదులివ్వు; "మీరు ఖర్చు చేసే ధనం ఏదయినా మీ తల్లిదండ్రుల కొరకు, బంధువుల కొరకు, అనాథలు, అగత్యపరులు, బాటసారుల కొరకు ఖర్చు పెట్టండి. మీరు ఏ మేలు చేసినా దాన్ని గురించి అల్లాహ్ తెలుసుకుంటాడు."

(అల్ బకర : 215)

ఒక మనిషిపైన సమాజంలోని ఏ ఏ వ్యక్తులు, వర్గాల హక్కులు విధితమవుతాయో వాటి ప్రస్తావన దివ్యఖుర్ఆన్‌లోని మక్కీ సూరాలోనూ ఉంది. మదనీ సూరాలలోనూ ఉంది. మక్కాలో కుర్ఆన్ అవతరించే సమయాన సమాజంలోని బలహీన, పాలిత, అణిచివేతకు గురయిన వారి హక్కులే తొక్కివెయ్యబడలేదు. సమీప బంధువులు, ఆప్తులు, రక్త సంబంధీకుల హక్కుల పైన సయితం చెయ్యి చేసుకోవడం జరిగేది. ఇస్లామ్ దీనికి వ్యతిరేకంగా గొంతెత్తి మాటలాడింది. ఎవరిచేత ఈ హక్కులు అణగదొక్కబడుతున్నాయో వారికి ఇహపరాలలో కలిగే అత్యంత దుష్పరిణామాలను గురించి హెచ్చరించడం జరిగింది. ఈవిధంగా ఇస్లామ్ ఆక్రమానికి ఎదురుగా, బాధితులకు మద్దతుగా నిలిచింది. అప్పుడు ముస్లిములు అల్ప సంఖ్యలో ఉండేవారు; ఇంకా మాటలాడితే చెప్పుకోదగ్గ సంఖ్యలో లేరనే చెప్పాలి. వారు క్రియారూపంలో ఈ హక్కుల సమర్థనలో, రక్షణలో నిలువగల స్థితిలో లేరు. అయినప్పటికీ ఇస్లామ్ ఈ హక్కుల ధ్వజవాహికగా ముందుకు వచ్చింది. అందువల్ల ఇస్లామ్‌కు శక్తి, అధికారం ప్రాప్తమయితే అది ఈ హక్కులను తప్పక రక్షిస్తుందని, సమాజాన్ని వాటిని ఆదరించేలా కట్టుబడజేస్తుందని అనుకోవడం కష్టమేమీ కాదు. కాగా మదీనాలోని ఇస్లామీయ రాజ్యస్థాపన తరువాత హక్కు గల ప్రతి వ్యక్తికి అతని హక్కు ఇవ్వడంతోపాటు ఆ వ్యక్తి పట్ల ఉత్తమరీతిలో మసలుకునే పద్ధతిని సమాజంలో ప్రచలితం చెయ్యడం జరిగింది.

దీని భావమేమిటంటే ముస్లిములు ఎక్కడున్నా, వారు అల్ప సంఖ్యాకులయి ఉన్నా లేదా అధికసంఖ్యాకులయి ఉన్నా అధికారం కలిగిఉన్నా, అధికారం లేకపోయినా వారు కూడా హక్కుల రక్షకులయి మెలగవలసి ఉంటుంది. వారు ఎవరినీ మరెవరి హక్కులపైనా చెయ్యి చేసుకునేందుకు అనుమతించరు. ఏ వ్యక్తి అయినా మరే వర్గమయినా ఒకరి హక్కు కాజేసినట్లు ముందుకువస్తే వారికి ఎదురుగా తమ కంఠం విప్పడమేకాక, హక్కుదారునికి అతని హక్కును ఇప్పించడానికి ప్రయత్నిస్తారు.

## నైతిక బోధనలు

ఇక ఈ విషయాన్ని నైతికతరీత్యా పరిశీలిద్దాం. ఒక వ్యక్తి సంబంధాలు మరో వ్యక్తితో ఎలా ఉండాలి అన్నది నైతికత రీత్యాను, చట్టం రీత్యాను గమనించ వలసి ఉంటుంది. అయితే ఈ వ్యవహారం చట్టం కన్నా నైతికతా ప్రధానమయినదే

అధికం, ప్రముఖం. ఇస్లామ్ దాని అనుయాయులకు ఏ నైతిక బోధనల శిక్షణ గరిపిందో వాటి ద్వారా సునాయాసంగా ఇది తేటతెల్లమయిపోతుంది. ఒక ముస్లిమ్ వ్యక్తి సంబంధాలు ముస్లిమేతర వ్యక్తితో ఎలా ఉండాలి అన్న విషయం, ముస్లిమేతర వ్యక్తి పట్ల అతని వైఖరి ఎలా ఉండాలన్న మాట ఇట్టే తెలుసుకోవచ్చు. ఇస్లామ్ తన అనుయాయుల్ని నైతిక మూల్యాలను పాటించేవారుగా చూడదలచింది. దాని దృష్టిలో విశ్వసించినవారు దైవభక్తి పరాయణులు, నీతిమంతులు, సచ్ఛీలురితో కలిసి ఉండాలి.

يٰاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوا اتَّقُوا اللّٰهَ وَ كُوْنُوْا مَعَ الصّٰدِقِيْنَ ۝ (التوبة:١١٩)

'విశ్వసించిన జనులారా, అల్లాహ్‌కు భయపడండి. సత్యవంతులకు తోడు నివ్వండి'. (అత్ తౌబా : **119**)

వారు మాటలాడితే సత్యం కొరకు, న్యాయం కొరకే నోరువిప్పాలి. న్యాయం విషయంలో వారు తన వారని పరాయివారని వ్యత్యాసం పాటించరాదు.

اِذَا قُلْتُمْ فَاعْدِلُوْا وَلَوْ كَانَ ذَا قُرْبٰى ۚ (الانعام:١٥٣)

'మాటలాడవలసి వచ్చినప్పుడల్లా న్యాయమయినదే పలకండి, ఆ వ్యవహారం మీ సమీప బంధువుదే అయినప్పటికీ.' (అల్ అన్ఆమ్ : **153**)

యూదులు తమ వ్యవహారాల తీర్పులకు ఎప్పుడయినా ప్రవక్తశ్రీ సన్నిధిలో హాజరయ్యేవారు. ఆయన తీర్పులో తౌరాత్‌కు ప్రతిగా ఏదయినా సౌలభ్యముంటే దాన్ని స్వీకరిద్దామని, లేకపోతే దాన్ని తిరస్కరిద్దామని తలించి వచ్చేవారు. కాని ఎట్టి పరిస్థితిలోనూ ప్రవక్తశ్రీ(స) న్యాయం ప్రకారమే తీర్పు చెయ్యాలని దైవాదేశమయింది.

وَاِنْ حَكَمْتَ فَاحْكُمْ بَيْنَهُمْ بِالْقِسْطِ ۭ اِنَّ اللّٰهَ يُحِبُّ الْمُقْسِطِيْنَ ۝ (المائدة:٤٢)

'మరి తీర్పు చేసే మాటయితే సరిగ్గా న్యాయవంతంగా చెయ్యి. అల్లాహ్ న్యాయం చేసేవారినే ఇష్టపడతాడు'. (అల్ మాఇద : **42**)

అల్లాహ్ శత్రువుల ఎడల సయితమూ న్యాయబద్ధతను పాటించాలని గట్టిగా తాకీదు చేశాడు :

يَاَيُّهَا الَّذِينَ اٰمَنُوا كُونُوا قَوّٰمِينَ لِلّٰهِ شُهَدَآءَ بِالْقِسْطِ وَلَا يَجْرِمَنَّكُمْ شَنَاٰنُ قَوْمٍ عَلٰٓى اَلَّا تَعْدِلُوْا اِعْدِلُوْا هُوَ اَقْرَبُ لِلتَّقْوٰى وَاتَّقُوا اللّٰهَ اِنَّ اللّٰهَ خَبِيْرٌ بِمَا تَعْمَلُوْنَ ۝ (المائدة:٨)

'విశ్వసించిన జనులారా, అల్లాహ్ కొరకు నిజాయితీపై నిలకడ గలవారయి, న్యాయానికి సాక్ష్యం పలికేవారయి నిలవండి. ఒక వర్గం పట్ల గల శత్రుత్వం మిమ్మల్ని మరీ ఆగ్రహానికి గురిచేసి న్యాయవిరుద్ధంగా ప్రవర్తింపజేయరాదు. న్యాయబద్ధులై వ్యవహరించండి. ఇది దైవభక్తి పరాయణతకు మరింత యుక్తమయిన వైఖరి. అల్లాహ్‌కు భయపడుతూ మెలగండి, మీరు చేసేదంతా అల్లాహ్‌కు పూర్తిగా తెలుసు.' (అల్ మాయిద : 8)

కుర్ఆన్ ప్రకారం మనిషి జ్ఞానం, పరిశోధన అంటూ లేకుండానే నోరు తెరవరాదు.

وَلَا تَقْفُ مَا لَيْسَ لَكَ بِهٖ عِلْمٌ اِنَّ السَّمْعَ وَالْبَصَرَ وَالْفُؤَادَ كُلُّ اُولٰٓئِكَ كَانَ عَنْهُ مَسْئُوْلًا ۝ (بنی اسرائیل:٣٦)

'నీకు ఎరుక లేని ఏ విషయాన్ని గురించీ వెంటపడి వెదకకు. నిస్సందేహంగా కళ్ళు, చెవులు, మనసు- అన్నింటి విషయంలోనూ సమాధానం చెప్పుకోవలసి వుంటుంది.' (బనీ ఇస్రాయీల్ : 36)

'అది సజ్జనులయిన దైవదాసులను ఇలా ప్రశంసిస్తుంది. వీరు సౌశీల్య వంతులు, వారి శీల స్వభావాలు పరిశుద్ధమయినవి, వారు సచ్చరితులు, వ్యభిచారం, దుష్కార్యాలకు వారు దూరంగా మసలుకుంటారు, వారు తమ కామవాంఛల్ని సంతృప్తపరచుకోవడానికి కేవలం ధర్మసమ్మతమయిన 'హలాల్' విధానాలను మాత్రమే అవలంబిస్తారు. ఎవరయితే దీనిగ్గాను అధర్మ విధానాలు అన్వేషిస్తారో వారు పరిమితులు ఎరుగనివారు, మార్గవిహీనులు, దుర్వర్తనులు. (అల్ మూమినూన్: 5-7)

కుర్ఆన్ అశ్లీల చేష్టలకు సమీపాన కూడా చేరరాదని, వాటికి దూరంగా మెలగాలని తాకీదు చేస్తుంది.

وَلَا تَقْرَبُوا الْفَوَاحِشَ مَا ظَهَرَ مِنْهَا وَمَا بَطَنَ ۚ (الانعام:١٥١)

'లజ్జావిహీన విషయాల దరిదాపులకూ వెళ్ళకండి- అవి వ్యక్తమయినవయినా, గోప్యమయినవయినా.' **(అల్ అన్‌ఆమ్ : 151)**

దాని ఆదేశమేమిటంటే, విశ్వసించినవారు ఎవరితో వాగ్దానం, ప్రమాణం చేసినా దాన్ని నెరవేర్చాలి.

يٰۤاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْۤا اَوْفُوْا بِالْعُقُوْدِ ؕ (المائدۃ:١)

'విశ్వసించిన జనులారా, నిబంధనల్ని పూర్తిగా పాటించండి.'

**(అల్ మాఇద : 1)**

అది వారి మంచితనాన్ని ఇలా వివరిస్తుంది :

وَالَّذِيْنَ هُمْ لِاَمٰنٰتِهِمْ وَ عَهْدِهِمْ رٰعُوْنَ ۝ۙ وَالَّذِيْنَ هُمْ بِشَهٰدٰتِهِمْ قَآئِمُوْنَ ۝ۙ (المعارج:٣٢،٣٣)

'వారు తమ అప్పగింతలను కాపాడతారు, తమ ప్రమాణాలను పాటిస్తారు, తమ సాక్ష్యాలలో సత్యత, నిజాయితీలపైన నిలకడ చూపుతారు.'

**(అల్ మఆరిజ్ : 32,33)**

దాని ప్రకారం ఇతరుల హక్కులను కొల్లగొట్టడం మహా పాపం. ఇది వినాశ పథం. దీన్ని అనుసరించిన వ్యక్తి తన సర్వనాశనాన్ని కొనితెచ్చుకుంటాడు :

وَيْلٌ لِّلْمُطَفِّفِيْنَ ۝ۙ الَّذِيْنَ اِذَا اكْتَالُوْا عَلَى النَّاسِ يَسْتَوْفُوْنَ ۝ؗ وَ اِذَا كَالُوْهُمْ اَوْ وَّزَنُوْهُمْ يُخْسِرُوْنَ ۝ؕ (المطففین:١-٣)

'దండె కొట్టే వారికి వినాశం తప్పదు. వారు ఇతరుల నుండి తీసుకునేదయితే పూర్తిగానే తీసుకుంటారు, కాని వారికి కొలిచి లేదా తూచి ఇవ్వవలసి వస్తే నష్టం కలగజేస్తారు.' **(అల్ ముతఫ్ఫిఫీన్ : 1-3)**

మానవుల ఎడల ఎటువంటి తప్పుడు వైఖరినవలంబించినా దానికి అల్లాహ్ సన్నిధిలో జవాబు చెప్పుకోవలసి ఉంటుందన్న వాస్తవాన్ని ఎరిగిన దైవదాసులు, మానవుల హక్కులపైన ఎటువంటి చెయ్యి చేసుకోవడానికయినా ముందుకు వస్తారని

ఆశించలేము. వారి వ్యవహారాలు పరిశుభ్రంగా, ఎటువంటి అన్యాయం అక్రమాల కయినా దూరంగా ఉంటాయి.

అల్ ఫుర్కాన్ సూరాలో చివరన విశ్వసించినవారి సుగుణాల ప్రస్తావన ఉంది. వాటిలో కొన్ని ఇవి, వారు అహంకారాన్ని ప్రదర్శించరు. వినయ వినమ్రతల వైఖరిని అవలంబిస్తారు. వారు అజ్ఞానులతో వాదులాటకు దిగరు. అజ్ఞానులు వారితో వాదులాటకు దిగితే సలాములు పలికి దాటిపోతారు. (అల్ ఫుర్కాన్: 63)

వారు పిసినారితనానికి, దుబారా ఖర్చుకు దూరంగాఉంటూ మధ్యస్థ మార్గాన్ని అవలంబిస్తారు. ధనాన్ని సరయిన చోట, సరయిన అవసరానికనుగుణంగా ఖర్చుపెడతారు. (అల్‌ఫుర్కాన్ : 67)

వారు మానవ ప్రాణాన్ని గౌరవిస్తారు. అన్యాయంగా ఎవరి ప్రాణమూ తీయరు. వ్యభిచారం, దుశ్చేష్టలకు దూరంగా మెలుగుతారు. (అల్ ఫుర్కాన్ : 68)

వారు అబద్ధపు సాక్ష్యం పలుకరు. అబద్ధపు, బూటకపు వ్యవహారాలకు దూరంగా మెలుగుతారు. వ్యర్థ వ్యవహారాలకు సౌజన్యశీలురులా తప్పించుకుపోతారు. (అల్ ఫుర్కాన్ : 73)

అష్ షూరా సూరాలో వారిని గురించి, వారు అశ్లీల చేష్టలకు దూరంగా ఉంటారని, ఎవరయినా వారిలో ఆగ్రహం తెప్పించినా కోపంలో మండించినా వారిని క్షమించివేస్తారని, వారు ఎవరి పట్లనయినా ప్రతీకారం తీర్చుకున్నా హద్దులను మీరరని సెలవీయడం జరిగింది. (అష్ షూరా : 37-40)

వారి గుర్తింపు ఏమిటంటే, వారు సమాజంలో నాస్తికత్వం, ధర్మవిహీనత, దైవ విరక్తి, అశ్లీలత, నగ్నత్వం, అనైతికత, అబద్ధం, మోసం, వంచనల్ని వ్యాపింపజెయ్యరు. వారికి మంచిని ఆదేశించాలని చెడును రూపుమాపాలని ఆజ్ఞాపించడం జరిగింది. (ఆలి ఇమ్రాన్: 110) వారు సదాచారం, భయభక్తులు, నైతికత వాతావరణాన్ని సర్వసామాన్యం చేస్తారు.

ఇది ఇస్లామీయ బోధనల కేవలం ఒక దర్శనం మటుకే. ఒక వ్యక్తి లేదా ఒక వర్గం శిక్షణ ఇటువంటి నైతిక వాతావరణంలో జరిగినప్పుడు ఇటువంటి వ్యక్తిని గురించి అతి సునాయాసంగా ఊహించడం సాధ్యమే. అతను ఇతరుల ఎడల ఎలా వ్యవహరిస్తాడో, అతను వారి ఎడల ఎటువంటి వైఖరినవలంబిస్తాడో.

ముస్లిములు ఈ నైతిక వైఖరి ముస్లిములతోనూ అవలంబించవలసి వుంటుంది. ముస్లిమేతరులతోనూ వ్యవహరించవలసి ఉంటుంది. దివ్యఖుర్‌ఆన్‌లో

కేవలం ముస్లింలు ఎడలనే, ఈ వైఖరినవలంబించవలసి ఉంటుందని, ముస్లిమేతరులతో వారి వైఖరి మరోవిధంగా ఉంటుందని ఎక్కడా మాట వరుసకయినా తెలుపడం జరగలేదు.

ఇక్కడ ఒక విషయం విశదీకరించవలసి వుంటుంది. అనేక నైతిక బోధనల సంబోధితులు ముస్లిములో లేదా ఇస్లామీయ సమాజమో అని మనం గమనిస్తాం. దీనికి భావం, ఈ బోధనలు కేవలం ముస్లిములకే వర్తిస్తాయన్నది కాదు. ఎందుకంటే ఇస్లామీయ బోధనలు, దాని నిజ సారాన్ననుసరించి ఆ బోధనలన్నీ సర్వసామాన్య మయినవి. వాటిని ముస్లిములు, ముస్లిమేతరులు అందరి ఎడలనూ పాటించడం జరుగుతుంది. దీన్ని రెండు ఉదాహరణల ద్వారా అర్థం చేసుకుందాం. బుఖారిలో హజ్రత్ అబ్దుల్లా బిన్ అమ్ర్ ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త(స) ఇలా సెలవిచ్చారు:

**المسلم من سلم المسلمون من لسانه و يده**

**ఏ ముస్లిమ్ చెయ్యి నుండి, నోటి నుండి ముస్లిములు సురక్షితంగా ఉంటారో అతనే నిజమయిన ముస్లిమ్' (మిష్కాత్ : కితాబుల్ ఈమాన్, బుఖారి, ముస్లిమ్)**

అంటే, ఎవరి చెయ్యి, నోరు ద్వారా ముస్లిములు సురక్షితంగా ఉంటారో వారే వాస్తవ భావంలో ముస్లిమ్ అన్నమాట. ఇక్కడ 'అల్ ముస్లిమూన్' అన్న పుంలింగ పద ప్రయోగం జరిగింది. కాని ఇదే భావంలో ముస్లిమ్ మహిళలన్న భావమూ వచ్చేస్తుంది. ఇదే ఆదేశం ముస్లిమేతరులకూ వర్తిస్తుంది.

కాగా మరో ఉల్లేఖనంలో 'అల్ ముస్లిమూన్' అన్న చోట 'అన్నాస్' (మానవులు) అన్న పదం ప్రయోగించబడింది. ఈ పదం జనులందరికీ వర్తిస్తుంది.

(ముల్లా అలీకార్, మిష్కాతుల్ మసాబీహ్ : 1: 143)

మరో హదీసులో విశ్వాసిని ఇలా నిర్వచించడం జరిగింది.

**المومن من امنه الناس على دمائهم و اموالهم.** (మిష్కాత్ : కితాబుల్ ఈమాన్, తిర్మిజి, నసాయి)

అంటే నిజమయిన, పరిపూర్ణమయిన ముస్లిమ్ ఎవడు అంటే, ఎవడిని తమ ధన ప్రాణాలకు రక్షకుడని జనులు భావిస్తారో అతనే. ఇంకా అతని వైపుగా తాము పూర్తిగా సురక్షితంగా, భద్రంగా ఉన్నామన్న తృప్తి ప్రాప్తం కావాలి, అతని ద్వారా తమకు ఎటువంటి బాధ కలిగే ప్రమాదం లేదన్న నమ్మకం కలగాలి. అతని ఈ వైఖరి ముస్లిమ్ ముస్లిమేతరుడు ఉభయులతోనూ ఉంటుంది.

ఈ హదీసుల్లో 'ముస్లిమ్', 'మా'మిన్' అన్న పదాలు స్వయంగా ఈ వాస్తవాన్ని

చాటుతున్నాయన్న యదార్థాన్ని సూచిస్తున్నాయని తెలుపడం జరిగింది.

ఒక హదీసులో కళ్ళు లేని కబోదికి కాస్తంత దారి చూపిన దానికి ఈవిధంగా మహత్తు తెలుపడం జరిగింది.

**من قاد اعمٰی اربعین خطوۃ و جبت له الجنة**

**'ఏ వ్యక్తి ఒక కబోదికి నలభయి అడుగులు దారి చూపుతాడో అతనికి స్వర్గం విధితమవుతుంది'**

ఇందులో ప్రయోగించిన కబోది అన్న పదం సాధారణమయింది. ఒక ముస్లిమ్ కబోది అన్న అర్థం వర్తించినట్టే ముస్లిమేతర కబోది అనే అర్థమూ వర్తిస్తుంది.

(మనావీ : అత్‌తయ్‌సీర్, బషరహుల్‌జామి' ఇస్సగీర్ : 2:4: 433)

## ధర్మ సందేశానికి ఆవశ్యకతలు

ఇక సందేశ ప్రచార దృక్కోణంలో ఈ వ్యవహారాన్ని పరిశీలిద్దాం. ముస్లిములు వాస్తవానికి, తమ వాస్తవ స్థానాన్ని బట్టి దైవం వైపునకు పిలుపునిచ్చే వర్గం. అది ఈ సముదాయానికి సంబంధించిన ప్రముఖమయిన బాధ్యత. ముస్లిమేతరులతో సంబంధాలను గురించి ఆలోచించేటప్పుడు ఈ కోణాన్ని మరువలేము. దీనిరీత్యా ప్రప్రథమ ఆవశ్యకత ఏమిటంటే, దేవుని దాసులయిన ఈ మానవులతో సందేశదాత సంబంధం హితబోధ ప్రధానమయింది, శ్రేయోభిలాష ప్రధానమయింది కాగలగాలి, అప్పుడే ఈ జనం వరకు అల్లాహ్ ధర్మాన్ని అతను చేరవేయగలడు. దేవుని సందేశ హరులు తమ జాతితో ఎటువంటి సంబంధం కలిగి ఉండేవారో అది మనకు అత్యుత్తమ ఆదర్శం. మహనీయ నూహ్ (అ) ఇలా అంటారు :

**اُبَلِّغُكُمْ رِسَالَاتِ رَبِّی وَ اَنْصَحُ لَكُمْ .... (الاعراف:٦٢)**

**'నిజానికి నేను నిఖిల జగతి ప్రభువు పంపిన సందేశహరుణ్ణి, మీకు నా ప్రభు సందేశాలను అందజేస్తూ ఉంటాను. మీ శ్రేయోభిలాషిని.'**

**(అల్ ఆరాఫ్ : 62)**

ఇదే శ్రేయోభిలాషను మహనీయ హూద్ (అలై) ఇలా వ్యక్తం చేస్తారు :

**اُبَلِّغُكُمْ رِسٰلٰتِ رَبِّی وَ اَنَا لَكُمْ نَاصِحٌ اَمِیْنٌ ○ (الاعراف:٦٨)**

**'మీకు నా ప్రభువు సందేశాలను అందజేస్తూ వున్నాను. నేను మీరు నమ్మదగ్గ శ్రేయోభిలాషిని.' (అల్ ఆరాఫ్ : 68)**

ఇదే స్థితి దైవసందేశహరులందరిదీను, హితబోధలో చిత్తశుద్ధి, ప్రేమ, అనురాగం, శ్రేయోభిలాష భావాలు తొణికిసలాడతాయి. ఇది, మనిషి ఆంతర్యం, తాను సందేశమిచ్చే ఆ జనుల శ్రేయోకాంక్షతో నిండి ఉన్నప్పుడు సాధ్యమవుతుంది. అప్పుడే అతను చిత్తశుద్ధితో వారికి ధర్మం, దాని ఆవశ్యకతలు విశదీకరిస్తాడు. దేవుని ఏకత్వపు అతిస్పష్టమయిన భావనను ముందుంచగలుగుతాడు. దైవదౌత్యం, కడపటి ప్రవక్తకు ఆధారాలను సమాయత్తపరుస్తాడు. పరలోకంలో సాఫల్యం పొందడం, నిష్ఫలత కలగటం అంటే ఏమిటో విడమర్చి తెలుపుతాడు. దేవుని సందేశహరుల్లో సంబోధిత జాతిని సంస్కరించే అతి తీవ్రభావన ఉంటుంది. వారు పూర్తి చిత్తశుద్ధితో వారి ఆలోచనాత్మక, ఆచరణాత్మక సంస్కరణను కోరుకుంటాడు.

మహనీయ షుఅయ్‌బ్(అ) ఎంతగా ఆవేదనతో, బాధతో అంటారో గమనించండి :

وَمَا أُرِيدُ أَنْ أُخَالِفَكُمْ إِلَىٰ مَا أَنْهَاكُمْ عَنْهُ ۚ إِنْ أُرِيدُ إِلَّا الْإِصْلَاحَ مَا اسْتَطَعْتُ ۚ وَمَا تَوْفِيقِي إِلَّا بِاللَّهِ ۚ عَلَيْهِ تَوَكَّلْتُ وَإِلَيْهِ أُنِيبُ ○

(ہود:۸۸)

'నేను మిమ్మల్ని ఏ పనుల నుండి వారిస్తున్నానో వాటికి స్వయంగా నేనే పాల్పడాలని ఎన్నటికీ కోరుకోవడం లేదు. నేనయిత నాకు సాధ్యమయిన మేర సంస్కరించాలనే కోరుకుంటున్నాను. మరి ఇలా నేను చేయదలచుకున్న దంతా దైవం ప్రసాదించే సద్బుద్ధిపైనే ఆధారభూతమయి ఉంది, నేను ఆయన్నే నమ్ముకున్నాను, ప్రతి వ్యవహారంలోనూ నేను ఆయన వైపునకే మరలుతుంటాను.' (హూద్ : 88)

ఈ విషయంలో హృదయ స్థితి సరిగ్గా ప్రవక్త హృదయ స్థితి లాంటిదే కాగలగాలి. దేవుని చివరి ప్రవక్త ఏ హృదయ స్థితిలో ఉండేవారో దాని చిత్రణ ఇలా జరిగింది.

فَلَعَلَّكَ بَاخِعٌ نَّفْسَكَ عَلَىٰ آثَارِهِمْ إِن لَّمْ يُؤْمِنُوا بِهَٰذَا الْحَدِيثِ أَسَفًا ○ (الکہف:۶)

'ముహమ్మద్, వారు ఈ బోధనను విశ్వసించకపోతే, ఆ బాధతో వీరి వెనుకాల బహుశా నీవు నీ ప్రాణాలనే ధారపోస్తావేమో.' (అల్ కహ్ఫ్ : 6)

ఆదేశమేమిటంటే సందేశ ప్రచార కార్యం వివేచనతో, ఉత్తమ హితబోధనతో, శ్రేష్టమయిన వాదనతో చేయాలి. సహనం దానికి తోడయి ఉండాలి. ఆగ్రహాన్ని దరిచేరనివ్వరాదు. ఈ మార్గంలో ఎదురయ్యే కష్టాలను భరించాలి. క్షమా మన్నింపుల ధోరణిని అలవర్చుకోవాలి. (అన్ నహ్ల్ : 128)

దీని భావమేమిటంటే, అల్లాహ్ సందేశహరులు ఏ జాతిలో సందేశ విధిని నిర్వర్తిస్తారో, ఆ జాతితో వారి సంబంధం, హితబోధన, శ్రేయోభిలాష, ప్రేమానురాగాలు, క్షమా మన్నింపుల సంబంధమయి ఉండాలన్నమాట. ఇంకా ప్రవక్తలు ఆ జనం ఆలోచనల, ఆచరణల సంస్కరణను కోరుకుంటున్నారన్నమాట. దీన్నిబట్టి ముస్లిమేతర సమాజంలో ముస్లింలు, ముస్లిమేతరుల మధ్య సంబంధాల విధానం కూడా విశదమవుతుంది. సందేశం అందజేయడం ఓ సున్నితమయిన కార్యం. ఏ వ్యక్తి అయినా, వర్గమయినా దాని కోసం నిలబడితే అది సంబోధిత జాతి పట్ల దైవ సందేశహరులు అవలంబించిన విధానాన్ని అవలంబించవలసి వుంటుంది. వారు ఏ శీల స్వభావాలను వ్యక్తం చేశారో వాటినే వ్యక్తం చేయవలసి వుంటుంది.

## సహాయ నిరాకరణ ఎవరితో?

తిరస్కారులు, బహుదైవారాధకులతో సహాయ నిరాకరణ చేయాలని, వారిని మిత్రులుగా చేసుకోరాదని కుర్ఆన్ ఆదేశమని కొందరు అంటారు. (ఆలి ఇమ్రాన్ : 144) వారిని అంతరంగికులుగా తమ రహస్యాలు తెలిసినవారుగా చేసుకోవడం కూడా తగదనీ అంటారు. (ఆలి ఇమ్రాన్ : 118) అయితే వారితో సంబంధాలు ఏర్పరచుకునేందుకు ఆధారం ఏమయి ఉంటుంది?

ఈ సందర్భంలో ఒక విషయం మరువరాదు, ఈ ఆదేశాల సంబంధం, యుద్ధ కాలానికి సంబంధించింది. యుద్ధ పరిస్థితులు, శాంతి పరిస్థితులు ఉభయ పరిస్థితుల ఆదేశాలు చాలావరకు వేరుగానే ఉంటాయి. ఏ జాతితో యుద్ధం జరుగుతూ ఉంటుందో దానితో సంబంధ రాహిత్యం, దానితో దూరంగా మెలగడం అన్నవి తప్పనిసరి, దీనికి ఆదేశాలివ్వబడతాయి. దానితో రహస్యంగా సంబంధాలు పెట్టుకుంటే తప్పక హెచ్చరించడమూ, కఠినంగా విచారించడమూ జరుగుతుంది. దీనిగ్గానూ మనిషి శిక్షకూ పాత్రుడు కావచ్చు. కాని యుద్ధానికి బదులు సంధి ఉన్న సందర్భంలో, ఇరు జాతులు ఏదయినా శాంతి ఒప్పందానికి కట్టుబడి ఉన్నట్లయితే

అప్పటి ఆదేశాలు వేరుగా ఉంటాయి. ఏ జాతితో యుద్ధం లేదో మరేదయితే ఇస్లామ్ ముస్లింల పట్ల శత్రుత్వం, వైషమ్యం వైఖరినవలంబించడం లేదో దాన్ని మరింత అతి స్పష్టంగా చెప్పడం జరిగింది. దానిపట్ల بر و قسط ఉత్తమ వ్యవహారం చెయ్యడంలో ఎలాంటి తప్పులేదు.

لَا يَنْهٰكُمُ اللّٰهُ عَنِ الَّذِيْنَ لَمْ يُقَاتِلُوْكُمْ فِي الدِّيْنِ وَلَمْ يُخْرِجُوْكُمْ مِنْ دِيَارِكُمْ اَنْ تَبَرُّوْهُمْ وَ تُقْسِطُوْٓا اِلَيْهِمْ ؕ اِنَّ اللّٰهَ يُحِبُّ الْمُقْسِطِيْنَ○ (الممتحنة:٨)

అల్లాహ్ మిమ్మల్ని వారించడంలేదు, ధర్మం విషయంలో మీతో యుద్ధం చేయని వారి ఎడలను, మిమ్మల్ని మీ ఇండ్ల నుండి వెలికి తీయని వారి ఎడలను, సద్వర్తనతో న్యాయబద్ధతతో వ్యవహరించడాన్ని కాదనడు. అల్లాహ్ న్యాయవంతంగా వ్యవహరించే వారంటే ఇష్టపడతాడు.

(అల్ ముమ్‌తహిన : 8)

ఆ తరువాత ఎవరితో మానసిక సంబంధం కలిగి ఉండటం, ఆప్త బంధుత్వం కలిగి వుండరాదో అదీ తెలుపడం జరిగింది.

اِنَّمَا يَنْهٰكُمُ اللّٰهُ عَنِ الَّذِيْنَ قَاتَلُوْكُمْ فِي الدِّيْنِ وَ اَخْرَجُوْكُمْ مِّنْ دِيَارِكُمْ وَ ظٰهَرُوْا عَلٰٓى اِخْرَاجِكُمْ اَنْ تَوَلَّوْهُمْ ۚ وَمَنْ يَّتَوَلَّهُمْ فَاُولٰٓئِكَ هُمُ الظّٰلِمُوْنَ○ (الممتحنة:٩)

ఆయన మిమ్మల్ని వారించేది, ధర్మం విషయంలో మీతో యుద్ధం చేసిన వారితోనూ, మిమ్మల్ని మీ ఇండ్లనుండి వెళ్ళగొట్టిన వారితోనూ, మీ బహిష్కరణలో ఒండొకరితో సహకరించుకున్న వారితోనూ మైత్రీబంధం కలిగిఉండటాన్ని. వారితో స్నేహం చేసినవారే అత్యాచారులు. (అల్ ముమ్‌తహిన : 9)

దీన్నిబట్టి తెలిసేదేమిటంటే, ఎవరు ముస్లిములతో యుద్ధంలో పాల్గొని ఉన్నారో వారితోనే సహాయ నిరాకరణ చేయాలని ఆదేశమిచ్చింది ఇస్లామ్. మరెవరయితే ముస్లిములకెదురుగా ఉగ్రవాదపు చర్యలు గైకొన్నా, ముస్లింల శత్రువులకు సహాయం చేసినా, అయినప్పటికీ ముస్లిములతో యుద్ధానికి పాల్పడకపోతే

ముస్లిములంటే ఎవరయితే వైషమ్యం శత్రుత్వం కలిగిలేరో ముస్లిములకు వారితో ఎటువంటి హాని కలగలేదో అటువంటి వారితో సహకారం, సానుభూతి, శ్రేయోభిలాష వైఖరిని అవలంబించడంలో ఏమీ తప్పులేదు.

హదీసుల ద్వారా తెలిసేదేమిటంటే, ముస్లిమేతరుల ఆహ్వానం స్వీకరించవచ్చు. ప్రచారోద్దేశ్యంతో వారికీ ఆహ్వానం పంపవచ్చు. వారి కానుకలు స్వీకరించవచ్చు. వారికి యోగక్షేమాలను పంచుకోవడమూ సరయినదే. దైవ సందేశహరులు ముస్లిమేతరున్ని ఆరోగ్యాన్ని విచారించేందుకు ఎంతో దూరం నడిచి వెళ్ళారు. ధర్మవేత్తలు వారి మరణం పట్ల సంతాపం వెలిబుచ్చటం కూడా సరయినదేనని తెలిపారు. ప్రత్యేక పరిస్థితుల్లో వారి అంత్యక్రియల్లో పాల్గొనడమూ సరయినదేనని ధర్మవేత్తలన్నారు. ఇటువంటి విషయాలలో ధర్మవేత్తల మధ్య భేదాభిప్రాయాలూ ఉన్నాయి. వాటి వల్ల ఇటువంటి వ్యవహారాలలో వీటికి అవకాశమూ ప్రాప్తమవుతుంది. మనిషి పరిస్థితుల రీత్యా ఏ కోణాన్ని అవలంబించినా దాన్ని తప్పుపట్టలేము.

(దీని వివరణకు రచయిత పుస్తకం చూడండి, 'ముస్లిమేతరులతో సంబంధాలు, వారి హక్కులు)

## వైముఖ్యం అధర్మం

ఇక్కడ ఒక ప్రాథమిక వాస్తవాన్ని మరువరాదు. ఇస్లామ్ దేవుని ఏకత్వ ఆధారంగా నెలకొన్న ధర్మం. ఈ విశ్వాసం సకల విధాల దైవ తిరస్కారులు, సకల విధాల బహుదైవారాధనలు, వాటి ఛాయలను సయితం అంగీకరించదు. వాటిన న్నింటి నుండి పరిశుద్ధమయింది. దైవ సందేశహరులు, పరలోక జీవితం పట్ల నమ్మకం కూడా ఇస్లామీయ విశ్వాసంలో తప్పనిసరి అంతర్భాగం. అందువల్ల ముస్లిములు ఎక్కడున్నా వారు తమ విశ్వాసాన్ని కాపాడుకోవడం, దానిపైన సుస్థిరంగా నిలవడం తప్పనిసరి. ముస్లిమ్‌వ్యక్తి ఎట్టి పరిస్థితిలోనూ దాన్ని వదలుకోనూ లేడు, లేదా ఈ విషయంలో ఎటువంటి ఇచ్చిపుచ్చుకోవడానికీ అంగీకరించలేడు. నేటి పరిస్థితుల్లో ఇస్లామేతర భావాలు ముస్లిములపైన అన్నివైపుల నుండి ప్రభావం చూపుతున్నాయి. దీనితోపాటు వారు ఎక్కడెక్కడ అల్పసంఖ్యలో ఉన్నారో అక్కడల్లా వారిపైన అధికసంఖ్యాకుల ఆలోచనాత్మక, సాంస్కృతిక, రాజకీయ ఒత్తిడి కూడా

నిరంతరాయంగా పడుతూనే ఉంటుంది. ఇటువంటప్పుడు ఇస్లామ్ ధర్మంపైన నిలకడ చూపడం అత్యంత కష్టం. అయినప్పటికీ వారు ఎట్టి పరిస్థితులలోనూ స్థయిర్యాన్నే నిరూపించవలసి ఉంటుంది. వారు ఎంతగా అల్పసంఖ్యలో ఉన్నప్పటికీ వారు తమ విశ్వాసం గాయపడకుండా జాగ్రత్త వహించవలసి వుంటుంది. అలాగే ఇస్లామీయ ప్రాథమిక భూమికలపైన దెబ్బ తగలకుండా చూడవలసి వుంటుంది. వారు తమ ఆలోచనలు, ఆచరణలు, శీల స్వభావాలరీత్యా తాము విశ్వాసులమని, ముస్లిములమని, ఇస్లామ్ ధ్వజవాహకులమని రుజువు చెస్తూ ఉండాలి. ఎట్టి పరిస్థితిలోనూ దీన్నుండి వైమఖ్యం చూపరాదు.

మూడవ అధ్యాయం

# ఇస్లామేతర రాజ్యంలో ఎటువంటి పాత్ర కావాలి?

ఇస్లామీయ బోధనల ప్రకారం, ఇస్లామీయ చరిత్ర ప్రకారం కూడా తెలిసేదేమిటంటే ఇస్లామ్, దాని అనుయాయుల్లో అనన్యమయిన ధార్మిక నైతిక శీల స్వభావాలను సృజిస్తుంది. అది వారిని పరమ ప్రభువు అల్లాహ్‌తో సన్నిహితం చేస్తుంది. దైవానికి భక్తిపరాయణులయిన చిత్తశుద్ధి గల దాసులుగా తయారు చేస్తుంది. వారి శీల స్వభావాలను పరిశుద్ధం, సమున్నతం చేస్తుంది. ఏ వ్యక్తి ఇస్లామ్ పట్ల విశ్వాసం, పరిపూర్ణ నమ్మకం కలిగిఉంటాడో, మరెవరయితే దాని బోధనల్ని పాటిస్తాడో అతను కలతల మార్గాన, దుష్ట మార్గాన నడవడం అటుంచి, ఒక్కడగు వెయ్యడమూ దుర్భరమయిపోతుంది. అతని ద్వారా సదా మంచితనం, ధర్మ నిష్ఠ, శ్రేయో శుభాలే కాంక్షించే వీలవుతుంది. ఈ ప్రపంచంలో ఒక ముస్లిమ్‌కు ప్రాప్తమయ్యే ఈ సుగణాలే అసలు సంపద. దీనిద్వారానే అతను పరిస్థితులను ఎదుర్కొంటాడు. వాటిని సరయిన దిశలో మలచడానికి ప్రయత్నం చేస్తాడు. దీనిద్వారానే అతను పలు పర్యాయాలు శత్రువుల హృదయాలనూ జయించాడు. వైరులపైన విజయాన్ని సాధించాడు. పరిస్థితులు అనుకూలంగా ఉన్నా ప్రతికూలంగా ఉన్నా మనిషి సంబంధం దైవంతో పటిష్టంగా ఉండాలని ఇస్లామ్ కోరుతుంది, మనిషి ఉన్నత నైతికతను ప్రదర్శించాలని అది అభిలషిస్తుంది. అయితే ఇస్లామేతర వాతావరణం పూర్వరంగంలో దాన్ని గురించి కొంత విశదీకరణ చేయవలసి ఉంటుంది.

## దైవం వైపునకు...

ప్రపంచంలో విశ్వాసులకు కఠినాతి కఠినమయిన పరీక్షలు ఎదురవవచ్చు. ముస్లిములు కష్టతరమయిన, అభేద్యమయిన పరిస్థితుల ద్వారా సాగవలసి రావచ్చు. ఇందులో ఎన్నో విజ్ఞతలున్నాయి. ఒక్కోసారి ఈ పరీక్షలు, విశ్వాసులు తమ విశ్వాస వాదనలు సత్యవంతులా కాదా అన్నదాన్ని పరీక్షించడానికి వస్తాయి. వీరిలో చిత్తశుద్ధి గల వారెవరో ఎవరు కారో చూడటానికి వస్తాయి. ఎవరు నిజ విశ్వాసులో ఎవరు కపటులో ప్రదర్శనాశీలురో చూడటానికీ వస్తాయి.

ఇస్లామీయ చరిత్ర తొలి రోజుల్లో మక్కాముస్లిములు, అత్యంత దుస్సహ మయిన, హృదయభంజకమయిన పరిస్థితుల్ని ఎదుర్కొన్నారు. పరీక్షలు వర్షంలా కురిసేవి. దివ్యకుర్ఆన్ ఈ పరిస్థితుల్ని ఇలా అభివర్ణిస్తుంది.

اَحَسِبَ النَّاسُ اَنْ يُّتْرَكُوْٓا اَنْ يَّقُوْلُوْٓا اٰمَنَّا وَهُمْ لَا يُفْتَنُوْنَ ۝ وَلَقَدْ فَتَنَّا الَّذِيْنَ مِنْ قَبْلِهِمْ فَلَيَعْلَمَنَّ اللّٰهُ الَّذِيْنَ صَدَقُوْا وَلَيَعْلَمَنَّ الْكٰذِبِيْنَ ۝ (العنكبوت:٢،٣)

'జనులు ఏమని అనుకుంటున్నారు. "మేము విశ్వసించాము" అని అన్నంతనే వారిని విడిచిపెట్టడం జరుగుతుందని, ఇక వారిని పరీక్షించడం జరగదని భావిస్తున్నారా? వాస్తవానికి మేము వీరికి పూర్వం గతించినవారినందరినీ పరీక్షించిఉన్నాము. అల్లాహ్అయితే ఇది తప్పనిసరిగా చూడవలసే ఉంది–సత్యవంతులెవరో, అబద్ధం పలికేవారెవరో.' (అల్ అన్కబూత్ : 2,3)

ఈ విషయాన్నే కొంత ముందుకు సాగి ఇలా ఇలా అంటుంది:

وَلَيَعْلَمَنَّ اللّٰهُ الَّذِيْنَ اٰمَنُوْا وَلَيَعْلَمَنَّ الْمُنٰفِقِيْنَ ۝ (العنكبوت:١١)

'అల్లాహ్అయితే తప్పనిసరిగా పరిశీలించవలసే ఉంది, విశ్వసించే వారెవరో, ద్వంద్వ నీతిపరులెవరో.' (అల్ అన్కబూత్ : 11)

నిజ విశ్వాసుల చిహ్నంగా, వారు అన్ని రకాల పరీక్షల్లో నిలకడ కలిగివుంటారని తెలుపడం జరిగింది.

وَلَنَبْلُوَنَّكُمْ بِشَيْءٍ مِّنَ الْخَوْفِ وَالْجُوْعِ وَ نَقْصٍ مِّنَ الْاَمْوَالِ وَالْاَنْفُسِ وَالثَّمَرٰتِ ۗ وَ بَشِّرِ الصّٰبِرِيْنَ ۝ (البقرة:١٥٥)

'మేము మిమ్మల్ని భయ ప్రమాదాలకు, క్షుద్బాధలకు, ధన ప్రాణాల నష్టాలకు, ఆదాయాల కొరతలకు గురిచేసి తప్పక పరీక్షిస్తాము. ఈ పరిస్థితులలో సహనం వహించేవారికి, ఏదయినా ఆపద వచ్చిపడినప్పుడు 'మేము అల్లాహ్కు చెందిన వారమే, అల్లాహ్ వైపునకు మేము మరలిపోవలసి వుంది' అని పలికేవారికి శుభవార్తనందజేయి.' (అల్ బకర : 155)

ఆ తరువాత, అననుకూల పరిస్థితుల్లో, కష్టాల్లో విశ్వాసులు అల్లాహ్ వైపునకు మరలుతారని తెలుపడం జరిగింది. దీనికారణంగా వారు ఇహపరాలలో ఆయన కారుణ్యం, దయా దాక్షిణ్యాలకు పాత్రులుగా నిర్ణయించబడతారని సూచించబడింది. విశ్వాసుల మానసిక స్థితిని ఇలా చిత్రించడం జరిగింది.

اَلَّذِيْنَ اِذَآ اَصَابَتْهُمْ مُّصِيْبَةٌ ۙ قَالُوْٓا اِنَّا لِلّٰهِ وَ اِنَّـآ اِلَيْهِ رَاجِعُوْنَ ۝ؕ
اُولٰٓئِكَ عَلَيْهِمْ صَلَوٰتٌ مِّنْ رَّبِّهِمْ وَ رَحْمَةٌ ۟ وَ اُولٰٓئِكَ هُمُ
الْمُهْتَدُوْنَ ۝(البقرة:١٥٦،١٥٧)

**'సహనం వహించేవారికి, ఏదయినా ఆపద వచ్చినప్పుడు 'మేము అల్లాహ్‌కు చెందినవారమే, అల్లాహ్ వైపునకే మేము మరలిపోవలసి ఉంది'. వారికి వారి ప్రభువు వద్ద నుండి అంతులేని అనుగ్రహాలు ప్రాప్తమవుతాయి. ఆయన కారుణ్యఛాయ వారిని కప్పుకుంటుంది. ఇలాంటి వారే రుజుమార్గాన ఉన్నవారు.' (అల్‌బకర : 156,157)**

కష్టాలలో అల్లాహ్ వైపునకు మరలడం మానవ నైజంలో నిబిడీకృతమయి వుంది. విశ్వాసి ప్రకృతి సజీవమయిన, శక్తిమంతమయినది. అతనిపైన ఎప్పుడెప్పుడు ఏదయినా పరీక్షా ఘడియ ఆసన్నమవుతుందో అతను కష్టాలను ఎదుర్కొంటాడో అప్పుడల్లా వెంటనే అతనికి, అతని సజీవ ప్రకృతిరీత్యా అల్లాహ్ వైపునకు మరలే సౌభాగ్యం ప్రాప్తమవుతుంది. అతను ఆయన సహాయాన్ని కాంక్షిస్తాడు. కష్టాల్లోనూ ఎవరయినా దైవం వైపునకు మరలకపోయినట్లయితే భావం అతని ప్రకృతి అనుభూతి రహితమయిపోయిందన్నమాట. అతను తన శక్తియుక్తులనే నమ్ముకుంటాడు కాని అల్లాహ్ వైపునకు మరలడు. నిజానికి అల్లాహ్ సహాయం లేనిదే అతని ఏ ప్రయత్నమూ ఫలవంతం కాజాలదు.

పరిస్థితులు కఠినత, తీవ్రత, మన బలహీనత, శక్తిహీనత తీవ్రంగా కోరేదేమిటంటే, అల్లాహ్ వైపునకు మరలాలి, ఆయన సంస్మరణతో మనోమయ జగత్తును సదా ప్రఫుల్లంగా ఉంచాలి. ఆయన్నే వేడుకోవాలి, ఆయన్నే ప్రార్థించాలి, ఆయన సహాయాన్నే అర్థించాలి. ఇదే ఒక విశ్వాసి నిజమయిన పాత్ర. దీనివల్ల మన ప్రయత్నాలు ఫలవంతమవుతాయని ఆశించగలము, అప్పుడే అల్లాహ్ సహాయ సహకారాలు ప్రాప్తమవుతాయి. కష్టాలు కడతీరుతాయి. జయాపజయాలు, సఫలతా నిష్ఫలితాలు అన్నీ అల్లాహ్ హస్తగతమయి ఉన్నాయన్న విషయాన్ని ఎన్నడూ మరువరాదు.

اِنْ يَّنْصُرْكُمُ اللّٰهُ فَلَا غَالِبَ لَكُمْ ۚ وَاِنْ يَّخْذُلْكُمْ فَمَنْ ذَا الَّذِىْ يَنْصُرُكُمْ مِّنْۢ بَعْدِهٖ ؕ وَعَلَى اللّٰهِ فَلْيَتَوَكَّلِ الْمُؤْمِنُوْنَ ○ (آل عمران:١٦٠)

'అల్లాహ్ మీ సహాయానికి వస్తే ఏ శక్తీ మిమ్మల్ని లోబరుచుకోజాలదు; అలాగే ఆయనే గనక వదలివేస్తే ఆ తరువాత మీకు సహాయపడగలిగేవాడెవడు? కనుక నిజమయిన విశ్వాసులు ఒక్క అల్లాహ్‌పైనే భారం మోపి వ్యవహరించాలి.' (ఆలి ఇమ్రాన్: 160)

## నమాజ్ సంస్థాపనం

నమాజ్ ధర్మంలో మూలస్తంభం వంటిది. దీన్ని అన్నివేళలా సర్వావస్థల్లో పాటించడం తప్పనిసరి. తీవ్రమయిన పరిస్థితుల్లోనయితే మరీను, అప్పుడు ఇది విశ్వాస శక్తికి అన్నింటినీ మించిన ఆధారం, ఆయుధం. దివ్యకుర్‌ఆన్ ఆదేశమిచ్చింది. కఠిన పరిస్థితిల్లోనూ, దుస్సహకాలంలోనూ నమాజ్ ద్వారానే సహాయం పొందాలని:

وَاسْتَعِيْنُوْا بِالصَّبْرِ وَالصَّلٰوةِ ؕ وَاِنَّهَا لَكَبِيْرَةٌ اِلَّا عَلَى الْخَاشِعِيْنَ ○ (البقرة:٤٥)

'సహనం ద్వారా, నమాజు ద్వారా సహకారం పొందండి. నిస్సందేహంగా నమాజ్ మహా జటిలమయిన కార్యమే. కానీ చివరికి తమ ప్రభువును కలుసుకోవలసి ఉందనీ, ఆయన వైపునకు మరలిపోవలసి వుందని భావించే విధేయులయిన దాసులకు మాత్రం కాదు.' (అల్ బకర : 45)

ఫిర్‌ఔన్ బనీ ఇస్రాయీల్‌పైన దురాగతాల పర్వతాలను విరిచివేశాడు. వారి సంతానాన్ని సంహరించేవాడు. వారిని బానిసత్వపు సంకెళ్ళల్లో, పాలిత జాతి పాతాళాల్లో పాతిపెట్టాడు, వారి మహిళలను అవమానపరిచాడు, మానాలను దోచుకోవడం జరిగేది; వారు ఒక విధంగా కాదు అనేక విధాలుగా అక్రమాలకు, దుర్మార్గాలకు గురయ్యేవారు. మానవ హక్కుల నుండి పూర్తిగా వంచితులయ్యేవారు. ఇటువంటి కఠినతర పరిస్థితుల్లో మహనీయ మూసా(అ) వారిని ధర్మంపైన నిలకడ కలిగి ఉంటూ నమాజ్‌ని స్థాపించాలని వీటి ద్వారా దైవ సహాయాన్ని కాంక్షించాలని ఆదేశించాడు.

اِسْتَعِيْنُوْا بِالصَّبْرِ وَالصَّلٰوةِ ؕ اِنَّ اللّٰهَ مَعَ الصَّابِرِيْنَ ○ (البقرة:١٥٣)

'విశ్వసించిన వారలారా! సహనం ద్వారానూ, నమాజు ద్వారానూ సహాయం పొందండి. అల్లాహ్ సహనం చూపేవారికి తోడయి ఉంటాడు.'

(అల్ బకర : 153)

మరో సందర్భంలో ఇలా నిర్దేశించబడింది :

اِسۡتَعِيۡنُوۡا بِاللّٰهِ وَاصۡبِرُوۡا (الاعراف:١٢٨)

'అల్లాహ్‌ను సహాయం అర్థించండి, సహనం వహించండి.'

(అల్ ఆరాఫ్ : 128)

పైన పేర్కొన్న ఆయత్ ద్వారా విశదమయిన విషయం, నమాజ్ ద్వారాను, సహనం ద్వారాను సహాయాన్ని అర్జించే ఆదేశం. భావమేమిటంటే ఇటువంటి పరిస్థితుల్లో సహనాన్ని పాటించాలి. సహనం కోల్పోరాదు. భయపడరాదు, ఏదీ పాలుపోక ఆందోళన చెందరాదు, నిరాశ చెందరాదు, భగ్న హృదయులూ కారాదు. ధర్మంపైన పూర్తిగా స్థయిర్యంతో నిలబడాలి, ఈ దుర్భర కార్యంలో నమాజ్ ద్వారా సహనం ద్వారా సహాయం ప్రాప్తం కాగలదు. ఆ సహాయాన్ని పూర్తిగా పొందాలి.

ఇకామతుస్సలాత్ అంటే అర్థం, 'నమాజ్' బాహ్యారూపమూ, దాని ఆవశ్యకతలూ పూర్తిగా నిర్వర్తించాలి, దాని నిజసారాన్నీ ఆత్మనూ తనలో సృజించుకునే ప్రయత్నమూ చెయ్యాలి. నమాజ్‌ని ఏవిధంగా నిర్వర్తించాలని ఆదేశమయిందో అదే విధంగా నిర్వర్తించాలి. సమయ పాలనతో, విధుల పాటింపుతో, ప్రవక్త సాంప్రదాయాలను, అదనపు నియమాలను పాటించాలి. నమాజ్‌లో భక్తిభావం, వినమ్రత, విధేయతా భావం, అల్లాహ్ సన్నిధానంలో హాజరయిన అనుభూతితో, చిత్తశుద్ధి, దైవం సమక్షంలో పశ్చాత్తాప భావం ఇత్యాది భావనలు సృజించుకునే ప్రయత్నం చెయ్యాలి. ఇటువంటి నమాజ్‌లో బాహ్యాపరమయిన నియమాలు, అంతరంగ స్థితులు తోడయితే దాని ప్రభావాలు సయితం బయల్పడతాయి.

ముస్లిముల ప్రతి బస్తీలో సామూహిక నమాజ్ ఏర్పాటు జరగాలి. దీనిగ్గాను మస్జిద్‌లు నిర్మించబడాలి. వాటిని పరిశుద్ధంగా ఉంచాలి. వాటిలో సమస్త ఏర్పాట్లు సవ్యంగా సక్రమంగా జరగాలి. ఇటువంటి అవసరమయిన చర్యల ద్వారా ఇకామతుస్సలాత్ (నమాజ్ సంస్థాపనం) భావన సంపూర్ణం, సమగ్రమవుతుంది. నమాజ్ ద్వారా పరమ ప్రభువు అల్లాహ్‌తో సంబంధం సుస్థిరమవుతుంది. జమాఅత్‌తోపాటు నమాజ్ ద్వారా ఒక సముదాయం భావనపైకి వస్తుంది. ఆ సముదాయంలో జనం

మధ్యన సర్వ సమానత, సమైక్యతా భావాలుంటాయి. చిన్నా పెద్ద, అగ్రవర్ణం, అథమ వర్గం అన్న తారతమ్యాలుండవు. దాని మధ్య సమైక్యత, ఏకాభిప్రాయాల వాతావరణం ఉంటుంది, అది విచ్ఛిన్నతకు దూరంగా సురక్షితంగా ఉంటుంది. అందులో ప్రతి వ్యక్తి మరో వ్యక్తి సానుభూతిపరుడు, బాధల్ని పంచుకునేవాడు. ఈ భావన సరయిన రీతిలో సముదాయంలో జనిస్తే దాని వ్యక్తి ఎవరయినా సరే ఆపదల్లో కష్టాల్లో నిస్సహాయునిగా భావించలేడు. అలాకాక తన్నుతాను సానుభూతిపరుల మధ్యనే కనుగొంటాడు. ఈ విధంగా సముదాయం, ఎంతటి కష్టాన్నయినా సునాయాసంగా అదుపు చేసుకోగలదు.

## కోపతాపాలకు దూరంగా....

మనిషి ప్రశాంతం మనస్కుడు, చల్లని నైజం కలవాడయి ఉండాలి. భావనలు, ఉద్రేకాలు, ఆవేశాలలో ఏదయినా చర్య గైకొనడం తీవ్రమయిన అవివేకం. ఏ బుద్ధిగలవాడు, తెలివి గలవాడయినా ఇలా చేస్తాడని ఆశించలేము. కొన్ని సందర్భాలలో కావాలని ఆగ్రహం రేకెత్తించడానికి ప్రయత్నాలు జరుగుతాయి. మనిషి ఇటువంటి ప్రయత్నాలను వమ్ము చెయ్యడంలోనే మానవుని విజయం దాగివుంటుంది. ఆగ్రహం రేకెత్తించడం జరిగేది దేనికీ, మనిషి మండిపడాలని, అదుపు తప్పి వ్యవహరించాలని చల్లగా ఆలోచించే వ్యక్తి ఎవడూ ఇష్టపడని విధంగా ప్రవర్తించాలని అలా చెయ్యడం జరుగుతుంది. దీనివల్ల ఆగ్రహం రేకెత్తించే వ్యక్తి ప్రయోజనం పొందుతాడు, ఆగ్రహం చెందే వ్యక్తి నష్టపోతాడు.

విశ్వాసుల సుగుణాలలో ఒకటేమిటంటే వారు ఆగ్రహం చెందరు, భావోద్రేకాలను, ఆవేశకావేశాలను ప్రదర్శించరు. ఒకరి తగిన చేష్ట, తప్పుడు వైఖరి వల్ల వారికి కోపం వచ్చినా వారు దాన్ని దిగమ్రింగి క్షమా, మన్నింపుల వైఖరినవలంబిస్తారు.

وَإِذَا مَا غَضِبُوْا هُمْ يَغْفِرُوْنَ٥ (الشورىٰ:٣٧)

'వారికి కోపం వచ్చినప్పుడు వారు క్షమించివేస్తారు.' (అషూరా : 37)

ఏ వ్యక్తి కోపాన్ని అదుపులో ఉంచుకుంటాడో, ఏ కారణంగా కోపం వచ్చిందో దాన్ని నిగ్రహించుకుంటాడో, చెల్లి ఉన్నా ఎటువంటి ప్రతిచర్యకు పాల్పడడో అతని విషయంలో దైవ సందేశహరులు (స) సెలవిచ్చిన దాని ప్రకారం, అల్లాహ్ అతన్ని

అందరి సమక్షంలో స్వర్గార్హునిగా ప్రకటిస్తాడు, అక్కడ అతని సుఖం, ప్రశాంతతల కొరకు అతనికి ఇష్టమయిన హూర్‌ను అతనికి అనుగ్రహిస్తాడు. హజ్రత్ మఆజ్, బిన్ అనస్ అల్‌జుహ్నీ (రహ్మ) ప్రకారం ఆయన(స) ఇలా సెలవిచ్చారు:

**من كظم غيظاً وهو يقدر على ان ينفذه دعاه الله الى رؤس الخلائق يوم القيامة حتى يخيره فى اى الحور شاء[(١)]**

'ఏ వ్యక్తి ఆగ్రహాన్ని అమలు చేయగల శక్తి ఉండీ దాన్ని దిగమ్రింగుతాడో అల్లాహ్ అతన్ని సమస్త జనం సమక్షంలో రప్పించి (తన వరప్రసాదాలను అనుగ్రహిస్తాడు) కడకు అతనికి అధికారమిస్తాడు, తాను ఇష్టపడే 'హూర్'ని ఎన్నుకునేందుకు."(మిష్కాత్ : కితాబుల్ అదబ్, బాబుర్రఫ్కివల్‌హయా....)

దైవ సందేశహరుల్ని ఒకరు ఏదయినా హితవు గరపమని కోరారు, (ఆ వ్యక్తి బహుశా లోనయి ఉన్న బలహీనత, త్వరగా ఆగ్రహం చెందడం కాబోలు) ఆయన(స) ఇలా బోధించారు. **لَاتَغْضَبْ** ఆగ్రహం చెందకు. ఆ వ్యక్తి మాటిమాటికి ఇదే ప్రశ్న అడిగాడు, మరేదయినా ఉపదేశిస్తారన్న ఆశతో. కాని ఆయన(స) ప్రతిసారీ ఇదే హితవు గిరిపారు- 'ఆగ్రహం చెందకు' (బుఖారి : కితాబుల్ అదబ్, బాబ్‌హజ్ర్ మినల్‌గజబ్...)

మనిషి గొప్పదనం అతను శారీరకంగా బలాఢ్యుడు, ఆరోగ్యవంతుడయి ఉండటంలో లేదు. నైతికంగా పటిష్టం అనడంలో ఉంది. అతను ఆగ్రహం కలిగించే పరిస్థితుల్లో తన భావావేశాలను ఎంతంగా అదుపులో ఉంచుకోగలుగుతాడో అంతగానే తన గొప్పదనాన్ని నిరూపించుకుంటాడు. దైవ సందేశహరులు ఇలా సెలవిచ్చారు:

**لَيسَ الشَّدِيْدُ بِالصُّرْعَةِ اِنَّمَا الشَّدِيْدُ الَّذِىْ يَملِكُ نَفْسَهُ عِنْدَ الْغَضَبِ[(٣)]**

'ఎవరినయినా చిత్తుచేసినవాడు కాదు బలశాలి, ఆగ్రహం కలిగిన వేళ తన్నుతాను అదుపులో పెట్టుకునేవాడే నిజమయిన బలవంతుడు' (బుఖారి : కితాబుల్ అదబ్, బాబ్ హజ్ర్ మినల్ గజబ్...; ముస్లిమ్, కితాబుల్ బిర్ర్ వస్సిమి, బాబ్ ఫజ్ల్ మిన్ యమ్లికునిఫ్సిహీ...)

కోపాన్ని దిగమ్రింగడం అంటే చేదు పాత్ర త్రాగడమే. ఇది సులువుగా గొంతుక నుండి దిగదు. కాని అల్లాహ్‌కు ఈ పాత్ర చాలా ఇష్టమయినది. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్(ర) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త ఇలా సెలవిచ్చారు;

**ماتجرع عبد جرعةً افضل عند الله عزوجل من جرعة غيظ يكظمها ابتغاء وجه الله تعالىٰ**(1)

'దాసుడు త్రాగే పానీయ పాత్రల్లోకెల్లా పరమ ప్రభువు దృష్టిలో ఘనత గల పానీయ పాత్ర ఆగ్రహ పాత్ర.

ఎవరయితే అల్లాహ్ ప్రీతిబడయటానికి ఈ పాత్ర తాగుతాడో అది అన్నింటి కన్నా ఘనమయినది. భావమేమిటంటే ఆగ్రహ పాత్ర అల్లాహ్ ప్రీతిబడయటానికి మనిషి త్రాగినట్లయితే అది ఆయన దృష్టిలో అన్నిటికన్నా విలువయిన పాత్ర. దీనికన్నా మరే పాత్రనయినా ఆయనకు ఇష్టమయినది కాదు.

కోప స్థితిలో మనిషి పరిణామం పట్ల లెక్క చెయ్యకుండా ఏమయినా చెయ్య గలుగుతాడు. ఊరకే ఉండటం ఇష్టపడడు. ఇది సరయిన వైఖరి కాదు. వ్యవహారం సత్యాసత్యాలదయినట్లయితే సత్యం కొరకు ఆగ్రహం చెందడం సరయినదే. కాని కేవలం తన తప్పుడు భావన, మానసికావస్థల తృప్తి కోసం ఆగ్రహ ప్రదర్శన సరయినది కాదు. దీనివల్ల పరిస్థితులు చక్కబరచడంలో సహాయం ప్రాప్తం కాదు, ఇంకా అవి మరింతగా చెడిపోయే ప్రమాదముంటుంది. అందువల్ల ఈ వైఖరికి దూరంగా మెలగాలి.

## మన్నింపు ఉన్నత నైతిక గుణం

మన్నింపు వహించడం చూపోపు వహించడం ఉన్నత నైతిక గుణం. ఇస్లామ్ దాని అనుయాయుల్లో ఈ గుణం సర్వసామాన్యం కావాలని కోరుకుంటుంది. దివ్య కుర్‌ఆన్ సద్గుణ సంపన్నులయిన దాసుల పరిశుద్ధ గుణగుణాలను ప్రస్తావించినప్పుడు వారిలో ఈ సుగుణాన్ని ప్రత్యేకంగా పేర్కొంటుంది.

**وَالْكَاظِمِيْنَ الْغَيْظَ وَالْعَـافِيْنَ عَنِ النَّـاسِ وَاللّٰـهُ يُحِبُّ الْمُحْسِنِيْنَO** (آل عمران:١٣٣)

'వారు క్రోధాన్ని దిగమ్రింగుతాను; ఇతరుల తప్పుల్ని మన్నిస్తారు- ఇలాంటి సద్వర్తనులే అల్లాహ్‌కు ఎంతో ఇష్టమయినవారు.' (ఆలిఇమ్రాన్ : 134)

దైవ సందేశహరుల(స) ప్రవచనాల్లో క్షమ, చూపోపులకు చాలా ప్రోద్బలం ఇవ్వడం జరిగింది. దానికి ఎంతో మహత్తు ఉన్నట్టు కూడా తెలుపడం జరిగింది. హజ్రత్ అకబ బిన్ ఆమిర్(రజి) ఉల్లేఖనంలో ప్రవక్త(స) ఇలా తెలిపినట్టుంది :

صِلْ مَنْ قَطَعَکَ وَاعْطِ مَنْ حَرَمَکَ وَاعْفُ عَمَّنْ ظَلَمَکَ (۱)

'బంధుత్వపు హక్కును నిర్వర్తించండి, మీ పట్ల బంధుత్వపు సంబంధాన్ని త్రెంచివేసేవాని పట్ల, మీ హక్కు నుండి మిమ్మల్ని వంచితులు చేసిన వ్యక్తికి అతని హక్కును ఇవ్వండి; మీ పట్ల అన్యాయంగా, అత్యాచారం చేసిన వ్యక్తి పట్ల క్షమాగుణం ప్రదర్శించండి.' (ముస్నద్ అహ్మద్ : 5, 161; బేరూత్ ప్రచురణ, 1994)

ఒక వ్యక్తి దైవ సందేశహరులు(స)ను అడిగారు, 'నాకు కొందరు బంధువులున్నారు, నేను వారిపట్ల బంధుత్వపు హక్కుల్ని నిర్వర్తిస్తాను; కాని వారు నా ఎడల బంధుత్వ సంబంధాన్ని త్రెంచివేస్తారు. నేను వారి పట్ల సద్వర్తనతో ప్రవర్తిస్తాను, కాని వారు నా ఎడల చెడుగా ప్రవర్తిస్తారు. నేను వారి పట్ల క్షమను, చూపోపును, సంయమనాన్ని అనుసరిస్తాను, వారు నా ఎడల అజ్ఞానపు వైఖరిని అవలంబిస్తారు.' దానికి ఆయన (స) ఇలా సెలవిచ్చారు, 'నీవన్నదే నిజమయితే నీవు వారి నోటిలో వేడి బూడిద నింపుతున్నావు, నీ ఈ వైఖరి ఉన్నంత కాలం దైవదూత నీ వెన్ను కాస్తూ ఉంటాడు.' (ముస్లిమ్ : కితాబుల్ బిర్రివస్సిలా, బాబ్ సిలుర్రహ్మ)

దివ్యకుర్ఆన్, అత్యంత హీనమయిన శత్రువుల ఎడల సయితం క్షమ, చూపోపుల వైఖరినే బోధించింది. యూదుల శత్రుత్వం, వైషమ్యం చాలా ప్రస్ఫుటమయిందే. కుట్రలు పన్నడం వారి నైజంలోనే ఉంది. వారు సతతం ముస్లిములకు వ్యతిరేకంగా విభిన్న రకాల కుతంత్రాలు పన్నుతూ ఉండేవారు. వారిని గురించి కుర్ఆన్ ఇలా అంటుంది :

وَلَا تَزَالُ تَطَّلِعُ عَلٰی خَآئِنَةٍ مِّنْهُمْ اِلَّا قَلِیْلًا مِّنْهُمْ فَاعْفُ عَنْهُمْ
وَاصْفَحْ اِنَّ اللّٰهَ یُحِبُّ الْمُحْسِنِیْنَ○ (المائدة:۱۳)

'అనుదినం వారు చేసిన ఏదో ఒక విద్రోహ చేష్ట నీకు తెలుస్తూనే ఉంటుంది. ఈ లోపానికి దూరంగా ఉన్నవారు వారిలో చాలా అరుదు. (కాగా ఈ స్థితికి

చేరడంవల్ల వారు ఏ దౌష్ట్యాలు చేసినా ఆశ్చర్యంలేదు) కనుక వారిని మన్నించు, వారి చేష్టల పట్ల చూపోపు వహిస్తూ ఉండు, ఉత్కృష్ట వైఖరినవలంబించే వారినే అల్లాహ్ ఇష్టపడతాడు. (అల్‌మాయిద : 13)

ఇక్కడ 'అఫ్‌న్', 'సఫ్‌హ్' అన్న రెండు పదాలు ప్రయోగించబడ్డాయి. రెంటి అర్థమూ దాదాపు ఒక్కటే. ఇందులో తప్పు చేసినవానికి శిక్ష విధించకపోవడం కోసం, ఆగ్రహం ప్రదర్శించకుండా ఉండటం, ఎత్తిపొడవకపోవడం, దెప్పి పొడవకపోవడం అన్న భావాలు అటువంటి సద్గుణాలు వస్తాయి. నిజానికి ఇదే గొప్ప నైతిక వైఖరి. కాని దీనికన్నా ఉన్నత విషయం ఏమిటంటే, మనిషి, అత్యాచారం చేసే వ్యక్తిని హృదయ పూర్వకంగా క్షమించివేయడం. అతనితో ఎటువంటి ఆక్రమం, అత్యాచారం జరగనట్టే వ్యవహరించడం. దీన్ని 'ఇహ్సాన్' అని అంటారు. ఇస్లామ్ కోరేది ఈ సుచరిత్రే! ముష్రిక్కుల పట్ల కూడా వారు చేసిన సమస్త అత్యాచారాలకు ప్రతిగా 'సఫ్‌హ్' 'క్షమ' వైఖరినే అవలంబించాలని ఆదేశించడం జరిగింది:

وَقِيْلِهٖ يٰرَبِّ اِنَّ هٰٓؤُلَآءِ قَوْمٌ لَّا يُؤْمِنُوْنَ ۝ فَاصْفَحْ عَنْهُمْ وَ قُلْ سَلٰمٌ ؕ فَسَوْفَ يَعْلَمُوْنَ ۝ (الزخرف:۸۸،۸۹)

ప్రవక్త పలికే ఈ మాట మీద ఒట్టు, ప్రభూ! ఈ జనులు విశ్వసించబోనివారు. సరే, ప్రవక్తా, వీరిని మన్నించు, మీకో సలామ్ అని చెప్పివెయ్యి అనతికాలం లోనే వీరికి అంతా తెలిసిపోతుంది. (అజ్ జుఖ్‌రుఫ్ : 88, 89)

మరో సందర్భంలో ఇలా సెలవీయడం జరిగింది :

اِنَّ السَّاعَةَ لَاٰتِيَةٌ فَاصْفَحِ الصَّفْحَ الْجَمِيْلَ ۝ (الحجر:۸۵)

'తీర్పు ఘడియ నిశ్చయంగా రానున్నది. కాగా, ముహమ్మద్, నీవు (వీరి కుచేష్టల విషయంలో) సౌజన్యవంతమయిన మన్నింపు వైఖరి వహించు.' (అల్ హిజ్ర్ : 85)

## ప్రతీకారానికి బదులు క్షమాగుణం

దివ్యకుర్‌ఆన్, మనిషికి జరిగిన అన్యాయం అత్యాచారాలకు బదులివ్వగలడన్న చట్టపరమయిన హక్కును అంగీకరించింది. అలాగే అతనికి క్షమించి చూపోపు

వహించేందుకు కూడా పురికొలిపింది. అది, బాధితునికి బాధించినవాని ఎడల ప్రతీకారం తీర్చుకునే హక్కు తప్పకుండా ఉందని అంటూ అది అతనికి విధి కాదు అని కూడా పలికింది. అతను తన ఈ హక్కును వినియోగించకుండా సహనం, సంయమనం పాటించి క్షమ, చూపోపు వైఖరినవలంబించినట్లయితే ఫలితం రీత్యా ఇది ఉత్తమం అని అంటుంది. ఇది ఆ వ్యక్తికి నైతిక విజయం అని, ఇదే అసలు కావలసిందనీ అంటుంది :

**وَاِنْ عَاقَبْتُمْ فَعَاقِبُوْا بِمِثْلِ مَاعُوْقِبْتُمْ بِهٖ ؕ وَلَئِنْ صَبَرْتُمْ لَهُوَ خَيْرٌ لِّلصّٰبِرِيْنَ ○ (النحل:۱۲۶)**

'మీరు ప్రతీకారం తీర్చుకోదలిస్తే మీపైన జరిగిన అక్రమానికి సమానమయిన మేరకే తీర్చుకోవాలి. కానీ మీరు సహనం వహిస్తే నిస్సందేహంగా అది సహనం వహించినవారికే మేలు కలుగజేస్తుంది.' (అన్ నహ్ల్ : **126**)

ఇందులో ప్రతీకారం తప్పనిసరి కాదన్న మాట స్పష్టంగా ఉంది. కాని ఒకవేళ మనిషి ప్రతీకారం తీర్చుకోవాలనే అనుకుంటే ఏ మేరకు అత్యాచారం జరిగిందో లేదా ఏ మేరకు నష్టం జరిగిందో ఆ మేరకే ప్రతీకారం తీర్చుకోగలడు. కాని మనిషి సహనం వహించడమే సరయినది. అష్ షూరా సూరాలో ఈ విషయాన్ని పూర్తిగా మరింత విశదంగా ఇలా తెలుపడం జరిగింది :

**وَجَزٰٓؤُا سَيِّئَةٍ سَيِّئَةٌ مِّثْلُهَا ۚ فَمَنْ عَفَا وَ اَصْلَحَ فَاَجْرُهٗ عَلَى اللّٰهِ ؕ اِنَّهٗ لَا يُحِبُّ الظّٰلِمِيْنَ ○ وَلَمَنِ انْتَصَرَ بَعْدَ ظُلْمِهٖ فَاُولٰٓئِكَ مَا عَلَيْهِمْ مِّنْ سَبِيْلٍ ○ؕ اِنَّمَا السَّبِيْلُ عَلَى الَّذِيْنَ يَظْلِمُوْنَ النَّاسَ وَيَبْغُوْنَ فِى الْاَرْضِ بِغَيْرِ الْحَقِّ ؕ اُولٰٓئِكَ لَهُمْ عَذَابٌ اَلِيْمٌ ○ وَ لَمَنْ صَبَرَ وَ غَفَرَ اِنَّ ذٰلِكَ لَمِنْ عَزْمِ الْاُمُوْرِ ○ (الشورى:۴۰-۴۳)**

దౌష్ట్యానికి ప్రతీకారం, అటువంటి దౌష్ట్యమే, మరెవరయితే క్షమించివేసి సంస్కరిస్తారో వారి ప్రతిఫలం ఇవ్వడం అల్లాహ్ బాధ్యత, అల్లాహ్ అత్యాచారం

**చేసే వారిని ఇష్టపడదు. మరెవరయితే అత్యాచారం జరిగిన తరువాత ప్రతీకారం తీర్చుకుంటారో వారిని నిందించడం తగదు. నిందార్హులయిన వారయితే ఇతరులపై దౌర్జన్యం చేసేవారు, భువిలో అధర్మంగా అత్యాచారాలు జరిపేవారు. ఇలాంటి వారికి వ్యధాభరితమయిన శిక్ష పడుతుంది. అయితే సహనంతో వ్యవహరించే, మన్నింపు వహించే వ్యక్తి విషయం మటుకు ఉన్నత సంకల్పనిరతి, సాహసోపేతమయిన చర్యలలోని పని.**

**(అష్షూరా : 40-43)**

ఈ విధంగా ఇస్లామ్ మానవునికి అన్యాయానికి ప్రతీకారం తీర్చుకునే చట్టపరమయిన హక్కు ఇచ్చింది. అలాగే దానితోపాటు క్షమ, మన్నింపుల ఉన్నత నైతిక వైఖరినవలంబించేందుకు కూడా పురికొలిపింది. దీన్నిబట్టి మనిషి ప్రతీకారపు చర్య తీసుకోదలిస్తే అది అనివార్య పరిస్థితుల్లోనే తీసుకోవలసి ఉంటుంది. అదీ అలా చెయ్యడంలో ఏదయినా గొప్ప వ్యక్తిగత లేదా సాముదాయిక ప్రయోజనం ఇమిడి వుండాలి. లేకపోతే క్షమ, మన్నింపు వైఖరియే సరయిన పద్ధతి.

దివ్యకుర్ఆన్‌లోని ఈ వచనాలలో క్షమ, మన్నింపులతోపాటు సంస్కరణకూ ఆదేశమివ్వడం జరిగింది. కాగా ప్రారంభంలోనే ఇలా తెలుపడం జరిగింది.

فَمَنْ عَفَا وَ اَصْلَحَ فَاَجْرُهٗ عَلَى اللّٰهِ ؕ اِنَّهٗ لَا يُحِبُّ الظّٰلِمِيْنَ ۝

(الشوریٰ:۴۰)

**మరెవరయితే క్షమించివేసి సంస్కరిస్తారో వారి ప్రతిఫలం ఇవ్వడం అల్లాహ్ బాధ్యత, అల్లాహ్ అత్యాచారం చేసే వారిని ఇష్టపడదు. (అష్ షూరా : 40)**

పరిస్థితుల సంస్కరణకు ప్రప్రథమంగా చూడవలసిన విషయం, సంబంధాలలో చెడుగు ఎలా ప్రవేశించిదన్నది. తరువాత మన సిద్ధాంతాలు, సూత్రాలపైనే స్థిరంగా ఉంటూ ఆ చెడును రూపుమాపే పద్ధతి ఏది కాగలదన్నది చూడాలి. ద్వేషం, వైషమ్యం స్థానే ప్రేమ వాతావరణాన్ని ఎలా సృజించాలన్నది. దానికి సీరియస్‌గా కృషి జరపవలసి వుంటుంది. పరిస్థితుల్ని సంస్కరించాలంటే తొలుత శత్రువును మన్నించవలసి ఉంటుంది. ఆపైన సంబంధాలను చక్కబరచడానికి అనువయిన మార్గం వెదకవలసి వుంటుంది. ఆ తరువాతనే సంస్కరణ జరిగే ఆశ కలుగుతుంది.

## క్షమ, మన్నింపుల ఉదాహరణలు

క్షమ, మన్నింపుల ఉన్నత ఉదాహరణ మహనీయ యూసుఫ్(అ) జీవితంలో ప్రాప్తమవుతుంది. హజ్రత్ యూసుఫ్ పట్ల ఈర్ష్య ద్వేషాల వల్ల ఆయన సోదరులు హీనమయిన వైఖరిని అవలంబించారు. అటువంటి వైఖరి ఎవరయినా శత్రువుల ఎడల కూడా అనుసరించరు. వారు ఆయన్ని కాలక్షేపానికని షికారుకు తీసుకువెళ్ళారు. అక్కడ ఒక పాడుపడ్డ బావిలో పడవేశారు. పరమ ప్రభువు ఆయన్ని రక్షించాడు. ఆయన్ని ఆ బావి నుండి తీయడం జరిగింది. విభిన్న పరీక్షలు, విపత్తులనెదుర్కొన్న తరువాత ఈజిప్ట్ సింహాసనానికి చేరేలా చెయ్యడం జరిగింది. మహనీయ యూసుఫ్(అ) సోదరులకు ఆయనకు ప్రాప్తమయిన ఈ మహర్దశను గురించి ఏమీ తెలియదు. ఆయన దర్బారులో సహాయార్థం వెళ్ళారు. ఆయన(అ) వారికి పూర్తిగా సహాయం అందజేశారు. వారికి తరువాత తెలిసింది. తమ పట్ల ఈ ఉపకారం చేసిన వ్యక్తి తాము బావిలో పడేసిన తమ సోదరుడు యూసుఫే అని. అప్పుడు సిగ్గుతో వారు తమ తలలు ఎత్తలేకపోయారు. వారు తమ తప్పును అంగీకరించారు. హజ్రత్ యూసుఫ్(అ) ఒక్కసారిగా వారి అక్రమాలన్నింటినీ మరచిపోయారు, ఇంకా ఇలా అన్నారు :

لَا تَثْرِيْبَ عَلَيْكُمُ الْيَوْمَ ؕ يَغْفِرُ اللّٰهُ لَكُمْ ۫ وَهُوَ اَرْحَمُ
الرّٰحِمِيْنَ ۝ (يوسف:٩٢)

**"ఈ వేళ మిమ్మల్ని దేనికీ పట్టుకోవడం జరగదు, అల్లాహ్ మిమ్మల్ని క్షమించాలి. ఆయన అందరికన్నా అధికంతా కరుణించేవాడు."**

**(యూసుఫ్ : 92)**

ప్రపంచం మరోసారి అటువంటి ఉదార నైతికతా ఆదర్శాన్ని ప్రవక్త(స) జీవితంలో కానగలిగింది. ఆయన(స)కు రకరకాల బాధలు కలిగించిన కురైష్ ప్రజలు, ఆయన్ని మక్కా భూభాగాన్ని వదిలేవరకు, మదీనాకు వలస వెళ్ళేవరకు వదలనివారు, జీవితాంతం ఆయనతో పోరాడుతూ ఉన్నవారు, ఆయన రక్తపిపాసులు, ఆయన్ని ఆయన సహచరుల్నీ భూతలం నుండి రూపుమాపాలని సన్నద్ధులయినవారు, మక్కా విజయానంతరం అందరూ ప్రాణాలు బిగపట్టుకొని ఆయన నిర్ణయానికి వేచి వున్నారు. ఆయన వారినడిగారు, 'కురైష్ జనులారా, చెప్పండి నేను మీ పట్ల

ఎటువంటి వ్యవహారం చెయ్యనున్నాను?' వారు ఆయనతో తమ అనుభవం రీత్యా ఇలా అన్నారు : خیراً اخ کریم و ابن اخ کریم-- 'మీరు సుజన సోదరులు, సుజన సోదరుని సంతానం', మీనుండి మంచినే ఆశిస్తున్నాను' దానికి ఆయన వెంటనే అన్నారు : اذهبوا فانتم الطلقاء[1] 'వెళ్ళండి, మీరంతా స్వతంత్రులు. (ఇబ్ను హిష్షామ్ : అస్సీరతున్నబవియ్య : సంపుటి 4, పు. 60,61)

మరో ఉల్లేఖనంలో ఇలా వుంది. దైవసందేశహరులు (స) మక్కా విజయం నాడు సఫ్వాన్ బిన్ ఉమయ్య, అబూ సుఫ్యాన్ బిన్ హరబ్, హారిస్ బిన్ హిష్షామ్‌ని పిలువనంపారు. హజ్రత్ ఉమర్ లోలోనే అనుకున్నారు, 'నాకు దైవం ఈవేళ నాకు ఈ శత్రువులపైన అదుపునిచ్చాడు' అని. కాని ప్రవక్తశ్రీ ఇలా అన్నారు-

**مثلی و مثلکم کما قال یوسف لاخوته لَاتَثْرِيبَ عَلَيْكُمُ الْيَوْمَ يَغْفِرُ اللّٰهُ لَكُمْ**

**'నాకూ మీకూ గల ఉపమానం యూసుఫ్(అ) తన సోదరులతో అన్నటు వంటిది- నేడు మీకు దేనికీ పట్టుకోవడం జరగదు, దైవం మిమ్మల్ని మన్నించుగాక! అన్నారు. హజ్రత్ ఉమర్ దానికి ఇలా అంటారు; పవిత్రమైన ప్రవక్త నోటి నుండి ఈ మాట వినగానే నాకు సిగ్గు వేసింది. నేనెలా ఆలోచించాను, ఆయన(స) ఎటువంటి నైతికతా ఔన్నత్యాల నుండి పలుకుతున్నారు అని సిగ్గిల్లాను- (ఇబ్ను సఅద్ : అల్ తబకాతుల్ కుబ్రా: సం2, పు.141,142, ఇబ్ను జౌజీ: అల్ వఫా బిల్ అహ్వాలుల్ ముస్తఫా : పు. 426)**

హజ్రత్ అబూ హురైరా ఇలా అంటున్నారు : మక్కా విజయం తరువాత దైవ సందేశహరులు (స) దైవ గృహం (కాబా) తవాఫ్ (ప్రదక్షిణ) చేశారు. రెండు రక'తుల నమాజ్ చేశారు. మళ్ళీ కాబా దగ్గరికి వచ్చారు. కాబా గుమ్మం రెండు పట్టీలను పట్టుకుని కురైష్‌తో అన్నారు, 'చెప్పండి, ఏమని అంటారు, ఏమని ఆలోచిస్తున్నారు.' దానికి వారు సమాధానం ఇచ్చారు. 'మీరు మా సోదరులు, మా పిన్నాన్న కుమారులు నిగ్రహం, కరుణ గలవారు.' ఈ మాటలు వారు మూడు మార్లు పలికారు. పిదప ప్రవక్త మహనీయులు(స) ఇలా సెలవిచ్చారు, **لَاتَثْرِيبَ عَلَيْكُمُ الْيَوْمَ** 'నేడు మిమ్మల్ని ఏ విషయానికీ పట్టుకోవడం జరగదు. అల్లాహ్ మిమ్మల్ని క్షమించుగాక. ఆయన దయ గలవారందరిలోకెల్లా దయ గలవాడు.

మహనీయ అబూ హురైరా ప్రకారం ఈ ప్రకటన తరువాత జనం గోరీల నుండి వెలికి వచ్చినటువంటి పరిస్థితి కనిపించింది. (అంటే వారికి పునర్జీవనం ప్రాప్తించినట్టు అన్నమాట) ఆ తరువాత వారంతా ఇస్లామ్‌లో ప్రవేశించారు. (ఇబ్నుల్ జౌజీ: అల్ వఫాబిల్ అహ్వాలుల్ ముస్తఫా : పు. 426)

మరో ఉదాహరణ చూడండి : బనీ ముస్తలిక్ యుద్ధంలో రసూలుల్లాహ్(స)తో పాటు హజ్రత్ ఆయెషా (ర) కూడా ఉన్నారు. తిరుగు ప్రయాణంలో ఆవిడ గారి ఏదో ఆభరణం ఒకచోట పడిపోయింది. దాన్ని వెదుక్కుంటూ ఆవిడ బిడారుకు వెనకాలే ఉండిపోయారు. తరువాత ప్రవక్త సహచరులు సుఫ్వాన్ బిన్ ముఅత్తల్ (రజి) వెంట తిరిగి వచ్చారు. దాన్ని కొందరు కపటులు గుసగుసలు మొదలెట్టారు. దైవం మన్నించుగాక, ఆవిడ గారి పైన అబద్ధపు ఆరోపణ మోపారు, ఈ ఆరోపణా చెడుగులో హజ్రత్ ముస్తిహ్(ర) కూడా తన భోలాతనం కారణంగా చెడిపోయారు. ఈయన హజ్రత్ అబూబక్ర్(ర)కు బంధువు. బీదవారు. హజ్రత్ అబూబక్ర్ ఈయనకు సహాయం అందజేసేవారు. ఈ ఘటన తరువాత హజ్రత్ అబూబక్ర్ సహాయం ఆపివేశారు. ఇక ఎన్నడూ తాను సహాయం చెయ్యనని ప్రమాణం కూడా చేసుకున్నారు. దాని మీదట అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు :

وَلَا يَاْتَلِ اُولُو الْفَضْلِ مِنْكُمْ وَالسَّعَةِ اَنْ يُّؤْتُوْٓا اُولِي الْقُرْبٰى
وَالْمَسٰكِيْنَ وَالْمُهٰجِرِيْنَ فِيْ سَبِيْلِ اللّٰهِ ۖ وَلْيَعْفُوْا
وَلْيَصْفَحُوْا ۭ اَلَا تُحِبُّوْنَ اَنْ يَّغْفِرَ اللّٰهُ لَكُمْ ۭ وَاللّٰهُ غَفُوْرٌ
رَّحِيْمٌ ○ (النور:٢٢)

"మీలో ఎవరు దైవానుగ్రహం కలిగినవారో, మరెవరు స్థోమతగలవారో వారు తమ బంధువులకు, నిరుపేదలకు, దైవమార్గంలో వలస వచ్చిన ముహాజిర్‌లకు సహాయం అందించబోమని ప్రమాణం చేసుకోరాదు. వారిని క్షమించివేయాలి, మన్నించాలి. అల్లాహ్ మిమ్మల్ని క్షమించాలని మీరు కోరుకోరా? అల్లాహ్ గుణం ఇదే, ఆయన క్షమించేవాడు కరుణించేవాడూను." (అన్ నూర్: **22**)

ఆపైన హజ్రత్ అబూబక్ర్ ఇలా అన్నారు, అల్లాహ్ మేము నీ క్షమ, దయలనే కోరుకుంటాము. ఇక హజ్రత్ ముస్తిహ్‌కు చేస్తున్న సహాయం మళ్ళీ మొదలెట్టారు.

ఇంకా ఇలా అన్నారు, దైవం పైన ఒట్టు, దీన్ని మరెప్పుడూ ఆపివెయ్యను.' (బుఖారి : కితాబుత్తఫ్సీర్, సూరా నూర్, బాబుల్ విలాఇజ్ సమి'తమూహు)

క్షమ, మన్నింపులకు సంబంధించిన ఈ పరిశుద్ధ ఉదాహరణల్ని విశ్వాసులు సదా తమ ముందుంచుకోవలసి ఉంటుంది.

## మధుర భాషణ

కొన్ని సందర్భాలలో నోటిని తప్పుగా ప్రయోగిస్తే పరిస్థితులు తప్పుదారి పడతాయి. వాటిని మళ్ళీ మామూలు స్థితికి తేవడం దుర్లభమవుతుంది. మధుర భాషణ పరిస్థితుల్ని చెడుగు నుండి రక్షించడానికి, వాటిని మెరుగుపరచడానికి దోహదపడుతుంది. దీనివల్ల సంబోధితునిపైన సద్భావం పడుతుంది. అతను చల్లని మనో మేధలతో మాట వినడానికి ఆలోచించడానికి ఉద్యుక్తుడవుతాడు. నైతికతకు ఇది తొలిమెట్టు, ఆ తరువాతనే దాని ఉన్నత దశలు ముందుకు వస్తాయి. బనీ ఇస్రాయీల్‌కు బోధించడం జరిగింది.

وَقُوْلُوْا لِلنَّاسِ حُسْنًا وَّ اَقِيْمُوا الصَّلٰوةَ وَ اٰتُوا الزَّكٰوةَ ۚ

(البقرة: ٨٣)

**"ప్రజలతో ఉత్తమ రీతిలో మాట్లాడాలని, నమాజ్‌ని స్థాపించాలని, జకాత్ నివ్వాలని మేము ఇస్రాయీల్ సంతానం చేత గట్టి ప్రమాణం చేయించాము."**

**(అల్ బకర : 83)**

ఇక్కడ ఒక విషయం గమనార్హమయింది. నమాజ్, జకాత్‌లకు ముందు మధుర భాషణను ప్రస్తావించడం జరిగింది. దీనికి కారణం, సంబోధితునితో మొదటి సంబంధం మాట ద్వారానే నెలకొంటుంది. అతనికి అనేక సందర్భాలలో నమాజ్, జకాత్‌లకన్నా ప్రముఖమయింది సంభాషణే అవుతుంది. అతను మాటలాడే వాని నమాజ్, జకాత్, ధార్మికతను చూడడు, అతని మాటలాడే తీరు, సంబోధనా విధానాన్ని గమనిస్తాడు. అందువల్లనే జనులతో సౌజన్యరీతిలో సంబోధించాలని ఆదేశమయింది.

దివ్యకుర్‌ఆన్ قُوْلُوْا لِلنَّاسِ حُسْنًا అన్న పదాలు ప్రయోగించింది. ఇందులో అతిశయ వచనముంది. దీని భావమేమిటంటే, నీ మాట అత్యంత సుందరమయింది, ఆసాంతం మాధుర్యం నిండిన దయ ఉండాలి. అందులోని ఒక్కొక్క పదం

అందంలోనూ తియ్యదనంలోనూ నిండా మునిగినదయి ఉండాలి. (జమఖ్షరీ, అల్ కష్షాస్, సం.1, పు.160, దారుల్ కుతుబుల్ ఇల్మియా, లెబనాన్)

ఉత్తమ సంభాషణలో మరో మాట కూడా చేరివుంది. మనిషి కుదురుగా వివేకవంతంగా సత్యవాక్కునీ, న్యాయవంతమయిన వాక్కునే పలకాలి. నైతికతను బోధించాలి. దైవధర్మాన్ని పరిచయం చేయాలి. దానిగురించి ఉన్న అపార్థాలను తొలగించాలి. దాన్ని స్వీకరించేందుకు ఆహ్వానించాలి. సమాజంలో మంచిని ఆదేశించే చెడును నిరోధించే విధిని నిర్వర్తించాలి. దీనివల్ల సమాజంలో మనిషి పట్ల భరోసా ఏర్పడుతుంది. అతను ఒక సరయిన సిద్ధాంతాన్ని నమ్మే వ్యక్తిగా సూత్రబద్ధుడయిన వ్యక్తిగా సమాజంలో గుర్తించబడతాడు. అతని మాటను సులువుగా తిరస్కరించడం జరగదు.

ఇదే బోధన ఇస్లామ్‌ను అనుసరించేవారికి ఈ పదాలలో చెయ్యడం జరిగింది.

وَقُل لِّعِبَادِی یَقُولُوا الَّتِی هِیَ اَحسَنُ اِنَّ الشَّیطَانَ یَنزَغُ
بَینَهُم اِنَّ الشَّیطَانَ کَانَ لِلاِنسَان عَدُوًّا مُّبِینًا۝ (بنی اسرائیل:۵۳)

**"నా దాసులకు చెప్పివెయ్యి, పలికితే ఉత్కృష్టమయిన మాటనే పలకండని. నిజానికి ఈ షైతానే మానవుల మధ్య కలతలు రేపే ప్రయత్నం చేసేవాడు. వాస్తవానికి షైతాన్ మానవుల ప్రత్యక్ష శత్రువు." (బనీ ఇస్రాయీల్ : 53)**

భావమేమిటంటే, మాట తీరులో సరయిన విధానాన్ని అవలంబించాలి. అందులో తూలనాడటం, ఎత్తిపొడుపులు, దుర్భాష, నిందారోపణ, కాఠిన్యం, క్రౌర్యం, వ్యక్తిగత దాడులు, అపనిందలు ఇత్యాది చెడుల నుండి దూరంగా ఉండే తీరు ఉండాలి. అందులో ప్రేమ, తియ్యదనం, మనోరంజక శైలి వుండాలి. దానివల్ల సంబోధితుడు ద్వేషాన్ని, దూరాన్ని కాక ఆకర్షణను గ్రహించాలి. దానికి కారణం ఒకటేమిటంటే దుర్భాషణా తీరువల్ల షైతాన్ చోటుచేసుకునే అవకాశం కలుగుతుంది. వాడు సంబోధితుని భావోద్రేకాలను ఆవేశకావేశాలను రేకెత్తిస్తాడు. మాటను అర్థం చేసుకోనివ్వడు, అర్థంచేసుకున్నా దాన్ని స్వీకరించనివ్వడు. మొత్తానికి పూర్తి వాతావరణం చెడిపోతుంది. షైతాన్‌కు ఈ అవకాశం ఇవ్వరాదు. ఇదే సఫలమయిన సంభాషణ.

## శత్రువులు మిత్రులవుతారు

ఇదే మాట మరో చోట చాలా విశదంగా చెప్పడం జరిగింది. దాని నైతిక ప్రభావాలను సయితం ప్రస్తావించడం జరిగింది :

وَلَا تَسْتَوِى الْحَسَنَةُ وَلَا السَّيِّئَةُ ؕ اِدْفَعْ بِالَّتِىْ هِىَ اَحْسَنُ فَاِذَا الَّذِىْ بَيْنَكَ وَ بَيْنَهٗ عَدَاوَةٌ كَاَنَّهٗ وَلِىٌّ حَمِيْمٌ ۝ وَمَا يُلَقّٰهَاۤ اِلَّا الَّذِيْنَ صَبَرُوْا ۚ وَمَا يُلَقّٰهَاۤ اِلَّا ذُوْ حَظٍّ عَظِيْمٍ ۝ وَاِمَّا يَنْزَغَنَّكَ مِنَ الشَّيْطٰنِ نَزْغٌ فَاسْتَعِذْ بِاللّٰهِ ؕ اِنَّهٗ هُوَ السَّمِيْعُ الْعَلِيْمُ ۝ (حٰمٓ السجدة:٣٤-٣٦)

**ప్రవక్తా! మంచీ చెడూ రెండూ సమానం కావు. నీవు చెడుగును గొప్ప మంచితో తొలిగించు. నీవు గమనిస్తావు- నీతో శత్రుత్వం ఉన్న వ్యక్తి నీకు ఆప్తమిత్రుడయి పోయాడన్న విషయం. ఈ సద్గుణ భాగ్యం (అందరికీ) ప్రాప్తం కాదు. కానీ, సహనశీలురకు మటుకే, ఈ స్థానమూ ప్రాప్తం కాదు. కానీ మహా సౌభాగ్యవంతులకు మాత్రమే. ఒకవేళ నీకు షైతాన్ తరఫున ఏదైనా దుష్ప్రేరణ కలిగితే అల్లాహ్ శరణు వేడుకో. ఆయన అన్నీ వింటాడు, అన్నీ తెలుసుకుంటాడు. (హా మీమ్ అస్ సజ్దా : 34-36)**

ఈ ఆయత్‌లలోని ప్రతి ఆయత్, అందులోని ఒక్కొక్క పదం గమనార్హమయినది. ప్రస్తుత పరిస్థితుల్లో అది అత్యుత్తమ మార్గనిర్దేశన, మార్గబోధన అందజేస్తోంది. చెప్పిందేమిటీ **وَلَا تَسْتَوِى الْحَسَنَةُ وَلَا السَّيِّئَةُ** అంటే మంచీచెడులు, ఏ నైతిక నియమావళి రీత్యాను, ఏ చట్టం రీత్యాను, ఏ బుద్ధి గలవారి దృష్టిలోనూ, ఎటువంటి పరిస్థితుల్లోనూ సమానం కాజాలవు. మంచిని గౌరవంగా మర్యాదగానే చూడటం జరుగుతుంది. చెడుకు ఎన్నడూ ఎప్పుడూ దీనికి అర్హత ప్రాప్తం కాదు, దానికి పరాభవం, అవమానాలు ప్రాప్తిస్తాయి. మంచికి ప్రభావాలు ఒకటయితే చెడుకు ఫలాలు మరోవిధంగా వెలువడుతాయి. మంచిఅన్నది ఎప్పుడూ శుభాన్నే తెస్తుంది. చెడుతో పాటు నిత్యం దౌష్ట్యం, కలహం మాత్రమే వస్తాయి. మంచికి పరిణామం

ప్రపంచం లోనూ పరలోకంలోనూ చెడుకు లభించే పరిణామానికి పూర్తిగా భిన్నంగా ఉంటుంది. అందువల్ల మంచి మార్గాన్ని అవలంబించాలి చెడు మార్గానికి దూరంగావుండాలి. ఎదుటి వ్యక్తి ఎత్తిపొడుపులు, తూలనాడులతో ముందుకువస్తే, దుర్భాషలు, హద్దులు మీరి మాటలాడటానికి ఉపక్రమిస్తే, అబద్ధాలకు పాల్పడితే, అబద్ధపు నిందారోపణలకు దిగజారితే, అప్రతిష్టపాలు చెయ్యడానికి ప్రయత్నిస్తుంటే అప్పటికీ నీవు కూడా అదే వైఖరినవలంబించడం, అదే దారిని పట్టడం నీకు శోభించదు. ఎందుకంటే ఆ తరువాత నీలోనూ అతనిలోనూ ఎటువంటి వ్యత్యాస ముండదు.

నీ వైఖరి నైతికత దృష్ట్యా నీ వైరికన్నా ఉన్నతంగా ఉండాలి. అది, 'اِدْفَعْ بِالَّتِیْ هِیَ اَحْسَنُ' దీని భావం ఏమిటంటే, తప్పుడు మాటల ఖండన అయినా దానికి సమాధానమివ్వడమయినా నీ అధికారమే. కాని అవలంబించవలసిన వైఖరి ఉత్తమమయినదయి వుండాలి. సౌజన్యమయినదయి వుండాలి. దాన్ని గురించి శత్రువు కూడా, ఇది సుజన వైఖరినవలంబించడం జరిగిందని అంగీకరించాలి. దీనికి ప్రతిఫలం అతి శీఘ్రంగానే ముందుకువస్తుంది. దీన్ని నీవే గమనిస్తావు' 'فَاِذَا الَّذِیْ بَیْنَکَ وَ بَیْنَهٗ عَدَاوَةٌ کَاَنَّهٗ وَلِیٌّ حَمِیْمٌ' ఏ వ్యక్తితో నీ వైషమ్యం ఉందో అతని వైషమ్యం తగ్గిపోతుంది, అతను నీకు మిత్రుడే కాదు, ఆప్తమిత్రుడయిపోతాడు.

హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ ఇలా సెలవిచ్చారు, ఈ ఆయత్‌లో ఎదుటి వ్యక్తికి ఉత్తమ రీతిలో సమాధానం ఇచ్చేందుకు చేసిన బోధనను అమలుపరిచేందుకు రెండు విధానాలున్నాయి. ఒకటి, అతను కోపాన్ని ఆగ్రహాన్ని ప్రదర్శిస్తే సహనం వహించాలి. అతను అతిగా ప్రవర్తించడానికి ఉపక్రమిస్తే మన్నించాలి. విశ్వాసులు ఈ విధానాన్ని అవలంబించినట్లయితే అల్లాహ్ పరమ ప్రభువు వారిని రక్షిస్తాడు. వారి శత్రువు వారి సమక్షంలో లొంగిపోతాడు, తాను ఆత్మబంధువయినట్లు మారిపోతాడు.' (బుఖారీ : కితాబుత్తఫ్సీర్, ఫుస్సిలత్ సూరా)

హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ పలికిన ఈ మాట ప్రస్తుత పరిస్థితుల్లో కరదీపికలాంటిది. ఆగ్రహం రేకెత్తించే ప్రయత్నం ఎంత జరిగినా ఆగ్రహం చెందకపోవడం, అక్రమాలు, అన్యాయాలు ఎన్ని జరిగినా బదులుగా క్షమ, మన్నింపుల వైఖరినే అవలంబించడం విజయానికి సోపానం. ప్రతి చిన్న మాటకు చిర్రెత్తిపోవడం, సహనాన్ని విడనాడటం నిష్ఫలతకు చిహ్నం.

ఆపైన ఇంకా ఇలా ప్రవచించబడింది :

وَ مَا يُلَقّٰهَآ اِلَّا الَّـذِيْنَ صَبَرُوْا وَمَا يُلَقّٰهَـآ اِلَّا ذُوْ حَظٍّ عَظِيْمٍ అంటే ఈ ఉన్నత శీల స్వభావాలు, ఈ పరిశుద్ధ వైఖరి అవలంబించగలవారు ఎవరు, ఎవరికయితే అల్లాహ్ సహనం, స్థయిర్యాల సంపద మెండుగా అనుగ్రహించాడో వారే. వారు పర్వతంలా తమ నిర్ణయం పట్ల నిలబడగలవారు, వారి దృష్టి తమ అసలు లక్ష్యం, ధ్యేయంపైనే స్థిరంగా ఉంటాయి. అటునుంచి మరలవు. ఎవరి దృష్టి తమ గమ్యంపైన నిలకడగా ఉంటుందో వారు దానిలోని కంపలు, పొదలు వేటినీ లెక్కచెయ్యరు. దారిలో రాళ్ళ రప్పలు గుండ్లు వారి సంకల్పాన్ని బలహీనపరచవు. వారు ఎన్ని కష్టాలు ఎదురయినా తమ పయనం నిరంతరం సాగనిస్తారు. కాని ఈ సంకల్ప నిరతి, ఈ సాహసం, ఈ ధైర్యం అదృష్టవంతులకే, సౌభాగ్యవంతులకే ప్రాప్తమవుతాయి.

ఈ సందర్భంలో చివరి బోధన,

وَاِمَّا يَنْزَغَنَّكَ مِنَ الشَّيْطٰنِ نَزْغٌ فَاسْتَعِذْ بِاللّٰهِ اِنَّهٗ هُوَ السَّمِيْعُ الْعَلِيْمُ

ఇందులో ఒక విషయాన్ని గురించి తెలియపరచడం జరిగింది. ఎప్పుడయినా ప్రయత్నాలెన్ని చేసినా షైతాన్ మిమ్మల్ని దారి తప్పించగలడు, ఇంతగా నీ పట్ల వ్యతిరేకత జరుగుతూ ఉంది కాని నీవేమో నోరు మూసుకుని కూర్చున్నావని, నిన్ను ఇంతగా పురికొలిపి జనం, ఇంతగా ఆగ్రహం తెప్పించినా నీవు మౌనం వహించావు, నీవు కూడా ఏ మాటకు ఆమాట జవాబెందుకు ఇవ్వవు. ఇంత పిరికితనం, భీరత్వం దేనికి? అని షైతాన్ మీపైన దాడి చేయగలడు. ఇటువంటి పరిస్థితిలో మీరు తప్పుడు ప్రతిచర్యకు గురికావచ్చు. అప్పుడు మీరు అర్థం చేసుకోవాలి, షైతాన్ మిమ్మల్ని నైతికంగా దిగజారడానికి దారిచూపుతున్నాడని. వెంటనే మీరు అల్లాహ్ వైపునకు మరలాలి. ఆయన్ను వేడుకోవాలి, మిమ్మల్ని షైతాన్ బారి నుండి రక్షించమని. అల్లాహ్‌ను పిలిచినప్పుడు ఆయన తప్పక వింటాడు. ఆయన ప్రతి వ్యక్తి హృదయ స్థితిని బాగా ఎరిగినవాడే.

## గర్వం, అహంకారం వదులుకోవాలి

అహంకారం అన్నది నైతిక రుగ్మత. ఇది సంబంధాలను సరయిన స్థాయిలో ఉండనివ్వదు. ఎత్తుపల్లాల బూటకపు భావోద్రేకాలను రేకెత్తిస్తుంది. మనిషి తన్నుతాను

పెద్దవానిగా, ఇతరుల్ని చిన్నవారుగా భావించినప్పుడు అతని వైఖరి కూడా మారిపోతుంది. ఇతరుల పట్ల చిన్నచూపు చూస్తాడు, వారిని నీచంగా పరిగణిస్తాడు. వారిని సమాన స్థాయివారుగా, సమాన స్థాయితో మసలుకోవలసినవారుగా చూడడు. తమకు సమానస్థాయి వ్యవహారానికి పాత్రులుగా తలచడు. అతని హక్కులు కాలరాయడానికీ వెనుదీయడు. అహంకారం ఒక వ్యక్తిలో ఉన్నట్లయితే అతను ఒకడు లేదా కొందరు వ్యక్తుల పట్ల నీచంగా, అసమానంగా ప్రవర్తించగలడు కాని ఒకవేళ ఒక జాతిలో, ఒక వర్గంలో ఆ వ్యాధి వ్యాపించినట్లయితే వారు ఇతర వర్గీయుల్ని, జాతుల వారిని అధమ వర్గీయులుగా, తమకన్నా హీనులుగా నిర్ణయిస్తారు. వారికి గౌరవ మర్యాదల స్థానమివ్వరు. అలాంటి ఆ 'అధమ' వర్గీయులు వారి అక్రమాలకు అత్యాచారాలకు గురవుతూ ఉంటారు.

గర్వం, అహంకారాలకు అనేక కారణాలు కావచ్చు. ధన సంపదలు మితిమీరి ప్రోగవడం, పాండిత్య ప్రకర్ష, సామర్థ్యాలు పుష్కలంగా ఉండటం, రాజకీయ, సామాజిక స్థాయి, ఇతరుల సంస్కృతీ సభ్యతలకన్నా తమ సంస్కృతీ సభ్యతల పట్ల స్వోత్కర్ష, తమ చరిత్ర, సంప్రదాయాలు, సమున్నతమయినవన్న భావన, ప్రభుత, అధికారం తదితర విషయాలు, కారణాలు, ప్రేరకాలు అనవసర పెద్దరికపు భావన అహంకారాన్ని సృజిస్తాయి. ఇస్లామ్ ఇటువంటి అహంభావాన్ని అతి కఠినంగా వారించింది. దీన్ని షైతాన్ భావనగా పేర్కొన్నది.

హజ్రత్ లుక్మాన్ తన తనయులకు చేసిన ఉపదేశంలో ఒకటి :

وَلَا تُصَعِّرْ خَدَّكَ لِلنَّاسِ وَلَا تَمْشِ فِى الْاَرْضِ مَرَحًا ۖ اِنَّ اللّٰهَ

لَا يُحِبُّ كُلَّ مُخْتَالٍ فَخُوْرٍ ۝ (لقمان:١٨)

**"జనులతో ఎడముఖంగా మాటలాడకు, భువిలో నిక్కుతూ నీలుగుతూ నడవబాకు, అల్లాహ్ స్వోత్కర్ష కలవానినీ గర్వం ప్రకటించే వ్యక్తినీ ఇష్టపడడు." (లుక్మాన్ : 18)**

ఇందులో ఉన్న బోధన ఏమిటంటే, నిన్ను నీవు పెద్దవానిగా తలచకు, జనులకు విముఖుడవయి మసలుకోకు, ఇది అహంకారానికి ఆనవాలు. సఖ్యతగా, సౌమ్యంగా, సుగుణశీలంతో వారితో సంభాషించు, ఎవరినీ హీనులయినవారుగా, అధములుగా

భావించి సంబోధించకు. దివ్యకుర్ఆన్ وَلَاتُصَعِّرْ అన్యప్రద ప్రయోగం చేసింది. దీని మూలం تصعير భాషా నిపుణులు దీనికి అర్థం చెబుతూ ఇది ఒంటెకు వచ్చే ఒక వ్యాధి అని చెప్పారు. ఆ వ్యాధిలో ఒంటె మెడ ఒకవైపునకు వంగిపోతుంది. అది మరోవైపునకు చూడజాలదు. ఇందులో ఉన్న సూచన ఏమిటంటే, అహంభావం వల్ల, ఒంటెలో ఈ వ్యాధి వల్ల పొడసూపే స్థితి నీలో రూపొందరాదు అన్నది. మెడ తిప్పి చూడటం కూడా దుర్లభం అయిపోతుంది, సవ్యంగా మాటలాడటమూ అసంభవమయిపోతుంది.

అహంకారం, గర్వం అన్నవి మనిషి నడక, నడకలో వేగం ద్వారా కూడా వ్యక్తమవుతాయి. అందువల్లనే وَلَا تَمْشِ فِي الْاَرْضِ مَرَحًا అని సెలవీయడం జరిగింది. అంటే నీ నడక వల్ల గర్వం దర్శనమివ్వరాదు. అహంకారుల నడకగా అగుపించరాదు. నీ నడకలో వినమ్రత, సఖ్యత గోచరించాలి. ఇతను ఒక సౌజన్యశీలుడు, నీతి మంతుడు ఇతనితో ఎవరయినా ఇట్టే కలవవచ్చు, ఇతనికి తన మాటను వినిపించుకో వచ్చు, ఇతను మన మాట వింటాడు, అరమరికల్లేకుండా ఇతని సహచర్యంలో గడపవచ్చు, దీనివల్ల అతను అయిష్టతను కాదు, ఆనందాన్ని అనుభవిస్తాడు. మన కష్టంలో బాధలో పాలుపంచుకుంటాడు అన్న విషయాలు చూసేవారికి స్ఫురించాలి.

మరో సందర్భంలో గర్వపు నడకను గురించి ఈ మాటల్లో వారించడం జరిగింది :

وَلَا تَمْشِ فِي الْاَرْضِ مَرَحًا ۚ اِنَّكَ لَنْ تَخْرِقَ الْاَرْضَ وَلَنْ
تَبْلُغَ الْجِبَالَ طُوْلًاo كُلُّ ذٰلِكَ كَانَ سَيِّئُهٗ عِنْدَ رَبِّكَ
مَكْرُوْهًاo (بنی اسرائیل:۳۷،۳۸)

"నేలపైన నిక్కుతూ నడవకు, నీవు నేలనూ చీల్చలేవు, కొండల ఎత్తులకూ ఎదగలేవు. ఈ విషమాలన్నింటినిలోనూ ప్రతి ఒక్కదాని చెడుకోణం నీ ప్రభువు దృష్టిలో అవాంఛనీయమయినది." (బనీ ఇస్రాయీల్ : 37, 38)

మానవుడు ఎంతటివాడు, ఒక పిడికెడు మన్ను. ఒక నీటి బుడగ, అయిదారడుగుల మనిషి గర్వపడితే ఏ విషయానికి? అతను తన్ను తన్ని నేలను చీల్చగలడా? లేదా నీలుగు చూపి తల పైకెత్తి కొండల ఎత్తులకు చేరగలడా? మరలాంటప్పుడు

అహంకారం దేనికి? వినయ వినమ్రతలు ఎందుకు అవలంబించడు? ఈ వాస్తవాన్నే ఈ ఆయత్‌లో బోధపరచడం జరిగింది.

చాలామంది నోటితోనూ తమ స్వోత్కర్షను చాటుకుంటారు. వారి ఈ వైఖరి కూడా గర్వంతో కూడుకున్నదే. దీనికి భిన్నంగా తమ అశక్తతను, వినమ్రతనూ, బలహీనతనూ ప్రకటించడంలో ఏ మాత్రం అలసట చెందరు. కాని వారి ఉనికి మొత్తం సాక్ష్యం పలుకుతూ ఉంటుంది. వారు స్వోత్కర్షలో అహంభావంలో నిండా మునిగి వున్నారని. ఈ రెండు వైఖరులు తప్పయినవి. దీనివల్ల మనిషి దేవుని కారుణ్యానికి దూరమవుతాడు. దేవుని దాసులయిన మానవుల ప్రేమకూ పాత్రుడు కాలేకపోతాడు.

